

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు
శ్రీగణేశాయనమః
శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః
హరి ఓంనమశ్శివాయ

శ్రీ గోపినాథ వేంకటకవి ప్రణీత

# మారుతి శతకము

గోపినాథ శ్రీనివాసమూర్తి

వేంకటకవి మనుమని మనుమని
తాత్పర్య వివరణములతో

ప్రచురణకర్త
గోపినాథ వసుంధరాదేవి

గోపినాథ వేంకటకవి సాహిత్యనికేతన ధర్మనిధి
8-2-351, ప్లాట్ నంబరు 4 మఱియు 5 త్రివేణి సంఘం అపార్టుమెంటు
ఆంధ్రజ్యోతి ఎదురుగా, బంజారాహిల్స్ రోడ్డు నంబరు 3,
హైదరాబాద్ - 500 034.

# నివేదనము

క. శ్రీరామచంద్ర విజయ, శ్రీరమణీరమణ సుగుణరేఖాభరణా
మారుతసుతసేవిత పద, సారసయుగళాభిరామ జలదశ్యామా (కృ.జఖం)

క. హరి నీ మంగళనామము, స్మరించి గావించునట్టి సత్కర్మమునన్
గరమెద్ది హీనమైనను, బరిపూర్ణంబై దనర్చు బద్మదళాక్షా (కృ.జఖం)

గోపినాథ వేంకటకవి శ్రీరామభక్తుడు నిరంతరరామనామజపముతో కాలము వెళ్ళబుచ్చువాడు. ఒకమహాయోగి ఉపదేశమువలన లభించిన కవిత్వవిద్యావిశేషము చేత శ్రీమద్రామాయణము, శ్రీకృష్ణజన్మఖండము, భగవద్గీతా శాస్త్రము, శ్రీరామస్తవము, బ్రహ్మానందశతకము, శిశుపాలవధము (మాఘకావ్యము) శ్రీరాధికాపరిణయము, తిరునాళదండకము మున్నగు కావ్యములు రచించుటకు సమర్థుడయ్యెను.

శ్రీమద్రామాయణమను మహామాలకు రత్నము మారుతి. కనుక మారుతిపట్ల భక్తి ప్రపత్తులను నివేదించుటకో అనునట్లు వేంకటకవి మారుతి శతకమును తొలుతొలుత రచించి రామాయణరచన కుపక్రమించెను. ఇది తన 16వ ఏట రచించినట్లు మొదటి పద్యములోని గురుస్వామిన్ పదప్రయోగమునుబట్టి ఊహింపవచ్చును (గురుశబ్దము జగద్గురువు శ్రీకృష్ణుని, స్వామి ఆంజనేయ, నరసింహ వంటి కొందరితోనే కూడి ఉండుటవలన ఇక్కడ నరసింహస్వామిని పాఠకులకు గుర్తుచేయునట్లు ప్రయోగించుట గమనింపదగినది. కనుక గురుస్వామి అనగా శ్రీకృష్ణుడని భావింపదగియున్నది) శ్రీమద్రామాయణము కృష్ణాంకితము. శ్రీకృష్ణుడు కలలో కనుపించి తనకంకితముగ తన అవతారకథను రచింపమని చెప్పినట్లు రామాయణమున చెప్పిరి కనుక వేదగిరి లక్ష్మీనరసింహస్వామిని తన 16వ ఏట దర్శించి మారుతీ శతకమున కుపక్రమించెనని భావింపవచ్చును. వేంకటకవి క్రీ.శ 1813 శ్రీముఖ సంవత్సరమున పుట్టి తన ఇరవయ్యవయేట అనగా క్రీ.శ 1833 నందన సంవత్సరమున రామాయణరచన కుపక్రమించెను. అనగా రామాయణరచనకు నాలుగుఏండ్ల గాఢ పరిశ్రమ చేసినట్లు తలంపవచ్చును. తదుపరి ఐదేండ్లలో అనగా క్రీ.శ1838 నకు రామాయణరచన ముగించి దేవతార్చనలో ఇరువది ఒక్క సంవత్సరములు పెట్టి పూజించుచుండిరి. ఇతని రామాయణము శ్రీమద్రామాయణమనుపేర క్రీ.శ 1887, 1894 లలో రెండుమార్లు వేంకటగిరి రాజులచే ముద్రింపబడినది. దాని ఉపోద్ఘాతమున క్రీ.శ 1859 ఆగష్టు 13 తేదీన వేంకటగిరి రాజులు వేంకటకవి రామాయణమును మూలమున కనురూపముగ రచించుట విని, పిలిపించి, సభాముఖముగ చదివించుకొని, మెచ్చి, సన్మానించి తద్రాజసన్ముఖమునకు దాఖలు చేయించుకొనినట్లుగా తెలిపిరి. ముగింపు నాటి నుండి వేంకటకవి దేవతార్చనలో పూజించిన వ్రాతప్రతి నేటివరకు వేంకటగిరిరాజ పూజామందిరమున (గోపీనాథ రామాయణ కవిస్వహస్త లిఖిత వ్రాతప్రతి) ఊయలయం దుండుట. పూజలనందుట విశేషము. ముందు రెండుపర్యాయములు శ్రీమద్రామాయణమను పేర ముద్రింపబడినను, శ్రీకృష్ణాంకితము కనుక క్రీ.శ 1916న వావిళ్ళవారు పైరెండు ముద్రణల ఉపోద్ఘాతముతోనే గోపీనాథ రామాయణమని ప్రప్రథమముగ మార్చుట అన్వర్థమయ్యెను. ఈ రామాయణము పురాణయోగ్యముగ నుండుటవలన శీఘ్రమున ప్రచారమై ఆంధ్ర దేశమంతటను విశేషఖ్యాతి నందినది. అందుననే క్రీ.శ 1900లో శ్రీవావిలికొలను సుబ్బారావు రామాయణము వ్రాయుచు అందు తెలుగులో రామాయణం రచించిన కవుల నందరినీ ఒకచిన్న కందపద్యమున పేర్కొని గోపినాథవేంకటకవిని మాత్రము ఒకశార్దూలపద్యమున స్తుతించెను.

## మారుతి శతకము

వేంకటగిరిసంస్థానకవులపై పరిశోధన చేసిన డాక్టర్ శ్రీకాళిదాసు పురుషోత్తముగారు మారుతిశతకప్రతి వ్రాసికొని వచ్చి దానిని నేను వ్రాసుకొనుట కిచ్చిరి. దానిని క్రీ.శ 1968లో ముద్రించితిని. వారిసేవకు కవివంశీయుడిగా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను. వచనరచననే ప్రీతిగ ఆదరించు ఈకాలమున కనుగుణముగ మారుతిశతకములోని పద్యములకు తాత్పర్యములను నేనేవ్రాసి ముద్రించుచున్నాను. పాఠకలోకము దీనిని ఆదరించి దినదినము పారాయణగ్రంథముగ పఠించి హనుమత్కటాక్షమునకు పాత్రులగుదురని విశ్వసించుచున్నాను.

ఈశతకమున ఉపాసనాదైవము 'శ్రీరామరక్ష సర్వజగద్రక్ష' అని చాటిన ఆంజనేయుడు. అతనిచరిత్రము బాల్యమాదిగ నిందు వర్ణితము. వీర, రౌద్ర, భయానకములిందలి రసములు. దీని కనుగుణముగ మత్తేభ, శార్దూలవృత్తములే ఈశతకమున వర్ణించినాడు. ఇట్లు కావ్యలక్షణములు, కల్పనాచాతురి. ధారాశుద్ధికలిగి దండకక్రియల భావములు పారాయణమున కనువుగ నుండి స్వతంత్రభావనా సముల్లాసితమైన ఈశతకము వాఙ్మయమున కలంకారము.

బ్రహ్మాంశసంభూతుడగు వాల్మీకికి ఆత్మతపః ఫలము శ్రీమద్రామాయణము. కనుక బ్రహ్మవరప్రసాదముతో యోగబలమువలన వాల్మీకి తన మనోనేత్రముతో చూచినది చూచినట్లే రామాయణమును రచించెను. అందు తను తరించిన తారకమంత్ర మహిమ ఆంజనేయుని రూపములో మనకు సాక్షాత్కరింపచేసెను. కనుక రూపుతాల్చిన భక్తే ఆంజనేయుడు. రామాయణమున సాక్షాత్కరించే పాత్రలలో రామపాదుకలనే పూజించిన భరతుడు, రాముని పూజించుట కొరకే ఆశ్రమమున నిరీక్షించుచుండిన శబరి. రామనామమును స్మరించి యుద్ధముచేసి రామనామమహత్త్వము చాటిచెప్పిన ఆంజనేయుని స్థానములు విశిష్టము. ఇచ్చట రామనామతపస్సు చేసిన వాల్మీకిని కూడా తలంపదగియున్నది. అందరు భక్తు లొకఎత్తు. హనుమంతు డింకోఎత్తు, సత్త్వదృష్టికి, భగవద్భక్తికి ఇతడు పరాకాష్ఠ. ఇంకే కావ్యంలోను. ఇతిహాసంలోను ఇంతటిపాత్ర నభూతో నభవిష్యతి. ఇతని అద్భుతచరిత్రే మారుతిశతకము. మారుతి, శ్రీరామనామ మహిమవలన స్వామి భక్తి వలన. ధర్మనిర్వహణము వలన, అనంతశక్తి సంపన్నుడు.

ఎదుటివాని మనోవాణి చదువగల శక్తి. తనమనోవాణి ఎదుటివాడు సరిగ తెలిసికొను పద్ధతిలో ప్రతిబింబింపగల శక్తి కలుగుటచే శ్రీరాముని ప్రథమదర్శనముననే ఆకర్షితుని చేసెను. దుష్కార్యములు సాధించు శ్రద్ధ.పట్టుదల, ధైర్యము, చొరవ కలిగినవాడు. కనుకనే మైనాకుని ఆవరణశక్తి, సురస విక్షేపశక్తి, ఛాయాగ్రాహిణి ప్రారబ్ధములను ఎదురించి కార్యసిద్ధిని గాంచెను. హనుమ కార్యదీక్షను పరీక్షించుటకు మొదట వచ్చినది నాగమాత సురస. స్త్రీని ఎదుర్కొంటే ఎట్లు ప్రతిస్తంభిస్తాడో పరీక్ష. అది నెగ్గెను. అది ఎదుర్కొనబోయే ఛాయాగ్రాహిణికి సూచన. ఛాయగ్రాహిణి రాక్షసస్త్రీ. ప్రారబ్ధ మేవిధముగా తప్పించుకొనుటకు వీలులేదో, అటువంటిది. అది మన నాకర్షిస్తుంది. దానిని మన శక్తి యుక్తి, చేతనె మించవలె. హనుమచేసిన దదే!

లంకను ప్రవేశించడములో, సీతను కానక, గతము నెమరు వేసుకొనడములో, మిగిలిన శేషకార్యములను గుర్తుతెచ్చుకొనడములో హనుమ చూపిన ప్రతిభ; ఏమనిషి ఏకార్యం, చెయ్యాలన్నా పాటించవలసిన మార్గమునకు దారి. లీలామాత్రపు ఆనవాళ్ళతో సీతను గుర్తుపట్టడములో. యోగబలముతో చిన్నవాడై ఆకుల మాటున నక్కడములో, తన ఉనికి సీతాదేవికి తెలుపుటకు సరియైన కాలమును ఎన్నుకొనడములో. రామకథ ఎట్లు ప్రారంభించి, ఏవేవి దాచి. ఏవేవి పెంచి, ఏభాషను, ఏబాణిలో వివరించవలెనో తెలిసిన నిపుణుడు. కనుకనే కార్యసాధి. తననాయకునిపై భక్తివిశ్వాసాలతో చేసిన తెగింపు హనుమ విజయమునకు మూలస్తంభాలు.

విభీషణశరణాగతి, ఇంద్రజిత్తును లక్ష్మణునిచే చంపించుట, లక్ష్మణుని మూర్ఛనుండి తేర్చుటకు సంజీవి పర్వతమును తెచ్చుట మొదలగు కార్యములలో హనుమ చూపిన యుక్తి, భక్తి శక్తులు విశేషము.

రావణసంహారానంతరం సీతాదేవికి వార్తను తెలుపుట, తిరుగుప్రయాణమున రాముడు భరద్వాజాశ్రమమున నున్నాడని భరతునకు తెలుపుట, వంటి విషయదూత కూడ హనుమనే. కనుకనే శ్రీరాముడు హనుమను హత్తుకునేకంటె ఏ మివ్వగల నంటాడు. ప్రతిమనిషియొక్క అసలైన ఆస్తి పంచభూతాత్మకమైన వారిదేహమే కదా. కనుక తనదంటూ ఇవ్వగలిగినది ఆత్మీయమైన హత్తు అని ధ్వనిస్తాడు. ఇట్టి హనుమచరిత్ర నిత్యపారాణమున కనువుగ 'తనయంత వలచివచ్చిన ఘనపదములు కూర్చి' సుందరకాండ పారాయణఫలముగ వేంకట కవి రచించెను. ఈ క్రింద ఉదహరించిన పద్యములు అతని రచనామాధుర్యమునకు మచ్చుతునకలు.

నీమాహాత్మ్యము నీరయోపచయమున్, నీసత్త్వసామగ్రియున్
సామాన్యంబె యొకింత వాయువునకున్, నాగారికిన్, కల్గితే
నేమోకాని, తలంప ముజ్జగములం దెవ్వారికిం గల్గదో
హైమాద్రి ప్రతిమోన్నతీ! గురుమతీ! అర్కద్యుతీ! మారుతీ!

నీనామంబు పఠించినన్, నిను మదిం జింతించినన్ నీకథా
గానం బుద్ధతి సల్పినం గరము వేడ్కన్ నిన్నుఁ బూజించినన్.
నానావ్యాధు లడంగు, వేలుపుల సన్మానంబు సంధిల్లు, వి
ద్యానైపుణ్యము కల్గు, చేకురును దీర్ఘాయుష్యమున్ మారుతీ!

విమలంబై, విన చిత్రమై, వితతమై, విద్యోతమై, వేద్యమై
యమృతంబై, యఘహారమై, యమితమై, యానందమై యాద్యమై
సుమనస్సమ్మతమై, సుధీవినుతమై, సుజ్ఞానమై, సూచ్యమై
సముదంచద్గతి నొప్పు నీమహిమ కీశగ్రామణీ! మారుతీ!

ఇది పిన్న వయసులో వ్రాసిన మొదటి రచన యైనను అప్పటికే అతడు రచనాసిద్ధిని పొందెనని తెలిసికొనుటకు ఈక్రింది శ్లోకానువాదమును గమనింపుడు.

శ్లో. ఆంజనేయ మతిపాటలాననం, కాంచనాద్రి కమనీయవిగ్రహం
పారిజాత తరుమూల వాసినం. భావయామిపవమాననందనం.... దీనికి తెలుగుచేత
అమరాద్రి ప్రతిమాన విగ్రహము, బలార్కప్రతీకాశవ
క్త్రము, శోభిల్లఁగఁ, పారిజాత తరుమూలం బందు గూర్చుండి యు

త్తమభక్తిన్ రఘురామమూర్తిని మదిన్ ధ్యానింపుచున్, దత్పవి

త్రమహామంత్ర మొగిన్ జపించు నిను నే బ్రార్థించెదన్ మారుతీ!

అష్టాక్షరిలోని 'రా', పంచాక్షరిలోని 'మ', కలిసిన దగుటచే 'మరా' అని రామనామ ముచ్చరించినను, వాల్మీకి తరించి, రామనామమునకు తారకనామమని ఖ్యాతిచేసెను. అట్టి హరిహరాత్మకమైన రామనామస్మరణ వేంకటకవి ఊపిరి. వేంకటకవి తను ఎప్పుడు జపించు శ్రీరామనామము, మనసున ధ్యానించు శ్రీరాముని రూపము, అదే ఆకారమును పొందిన హనుమంతుని ప్రతిబింబముగా భావించి, ఈ పద్యమును రచించినట్లు తలంపవలయును.

శరదభ్రశ్రేణుల దూరుచున్ వెడలుచున్ జాబిల్లి చందానc బు

ష్కరమార్గంబున నేగు నిన్నుc గని, నీ చాతుర్యమున్ మెచ్చి

నిర్జరు లానంద మెలర్పc జల్లిన మరుత్సంతాన పుష్పంబు ల

ట్లరు దారన్ గననయ్యెc జుట్టును సముద్యత్తారకల్ మారుతీ!

అంటూ ఆకాశంలో పయనించే హనుమంతుని వర్ణించిన తీరు ఎంతో మనోజ్ఞంగా ఉంది. దీనిలో ప్రయోగించిన 'దూరుచున్', 'వెడలుచున్', 'జాబిల్లి' గమనించిన, హనుమంతుడు పిల్లల ఆటవలె వెళ్ళినట్లు ధ్వనించుచున్నది. హనుమ సీతాదేవిని కనుగొనుటకై వెదకని చోటులేదు. అని ధ్వనిస్తూ వ్రాసిన, ఈ క్రింది పద్యాన్ని తిలకించండి.

అరవిందోత్పలకైరవోదర మరందాస్వాదనోన్మత్తబం

భరమాలాపరిషన్మనోజ్ఞమధురధ్వానాభిరంజత్ సరో

వరతీరంబులc బుష్పపల్లవఫలవ్రాతాగ్రధాత్రీరుహో

త్కరమూలంబుల నేర్పునన్ వెదకవే ధాత్రీసుతన్ మారుతీ!

హనుమ అశోకవనము పాడుచేసిన తరువాత తన రాకను రావణున కెరిగించుటకు, రాక్షసులతో తన్నుగూర్చి తెలుపుకొన్న విధమును గమనింపుడు

శైలోత్పాటన దక్షుండగు నభస్వత్పుత్రుడన్, జన్యవి

ద్యాలోలుండగు రామభద్రునకు నే దాసుండ, సుగ్రీవునిన్

వాలాయంబు భజించువాcడ, హనుమన్నామంబునన్ బొల్తు, భూ

పాలుం డంపగ భూమిపుత్రిc బరికింపన్ వచ్చితిన్, గ్రవ్యభు

క్కాలుండన్, జనుదెందు పోరికని, లంకం జాటవే మారుతీ!

వేంకటకవి తన ఇతర కావ్యములలో కూడ మారుతిని స్తుతించిన పద్యములను పరిశీలించినచో, ఆయనకు హనుమయందుగల అచంచలమైన ఆత్మీయత, ఆదరము వ్యక్తమగుటయే గాక, మారుతి శబ్దముపై ఆయనకుగల ప్రీతిని వెల్లడించును. ఇందలి ఉత్పలమాల, [illegible]మాలలో కూడ 'మారుతి' మకుటమును చూడగలము.

ఉ|| లెమ్ము, పయోధి నీవు నవలీలగ దాటి సురారి వీటికిం
బొమ్ము, మహీసుతన్ వెదకి పొల్పుగ గాంచి మహాజవంబుతో
రమ్ము, మహాత్ముడైన రఘురామునకున్ మితిలేని సంతసం
బిమ్ము, వనాటవంశమున కెంతయు మేటివి గమ్ము మారుతీ!

చ|| హితమతివై కపివర! యిచ్చటికిన్ రవిపుత్ర లక్ష్మణా
న్వితముగ రామభూవిభుని వేగమె తోడ్కొని రమ్ము దీనతం
బతి నెడబాసి యాదనుజపట్టణమందు గృశించుచున్న నా
కతులిత హర్ష మిమ్ము, సముదంచిత కీర్తివి గమ్ము మారుతీ!

శా|| అన్నా! రాముడు, భక్తవత్సలుడు, సువ్యక్త ప్రతాపుండు, తా
నన్నుం గానక దుఃఖశోకముల సంతాపించుచున్, డస్సి యా
పన్నుండై రవినందనుండు ధృతిదెల్పన్, మాల్యవంతంబుపై
నున్నాడా, కుశలంబుతోడ ననుజన్మోపేతుడై మారుతీ!

ఉ|| మారుతి గాంచె, మారుతకుమారునిపై ననుకంప జేర్చి, చె
న్నారగ శీతలుండ వగుమా యని సారెకు మారుతాప్తునిం
జీరుచు, జెక్కిటన్ గరము సేర్చి, సుపర్ణవికీర్ణశింశుపా
భూరుహమూలమందు గడ బొక్కుచు గూర్చుని యున్న జానకిన్

గోపీనాథ రామాయణ, శ్రీకృష్ణజన్మఖండములలో హనుమస్తుతులు, గోపీనాథ రామాయణ, సుందరకాండములో వీరరౌద్ర, భయానక రసముల సమ్మిళితమైన హనుమన్మూర్తిని చక్కని సీసపద్యములలో చూడవచ్చును.

గోపినాథ వేంకటకవిని గూర్చి నేటి సాహిత్య లోకములో ఎక్కువ మందికి పరిచయము లేదని నేను చింతించు చుండగా, కవిసామ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారు వేంకటకవి సుప్రసిద్ధ ప్రాచీన సాంప్రదాయక నవీనయుగ కవి అనియు, కవి ప్రతిభచే కావ్యము జీవించు ననియు, వారికావ్యములను ముద్రింపించి ప్రజల కందుబాటులో నుంచవలసిన భాద్యత కవి వంశీయుల దనియు, నుడివిరి. గోపినాథ వేంకటకవి కావ్యములు బృహత్ప్రమాణములు. అట్టి ముఖ్య కావ్యముల నొక్కొక్కదానిని అచ్చువేయవలెనన్న లక్షలరూపాయల వ్యయముతో కూడిన పని. అంతేకాక బహుప్రయాసలనుకూడ తీసికొన వలసియుండును. అది నాసమర్థతకు మించినపని.

తెలుగువిశ్వవిద్యాలయం వారు వేంకటకవికి సాహిత్యజగత్తులో గల ఉత్కృష్టస్థానమును గుర్తించి నా అభ్యర్థన మేరకు ప్రసిద్ధమగు గోపీనాథరామాయణమును 1987 వసం||న ముద్రింపించిరి. వారికి నా కృతజ్ఞతలు. శ్రీ కృష్ణజన్మఖండమును కూడ ముద్రింపించమని

తెలుగు విశ్వవిద్యాలయము వారిని అభ్యర్థించి యున్నాను. ఇది రాధాకృష్ణతత్త్వమును విశద పరచునది. కావున దీని ప్రాముఖ్యము తెలుపవలసిన అవసరము లేదు.

చంద్రుని కొక నూలి పోగు అన్నట్లు, నాశక్తి మేరకు శిశుపాలవధ మహాకావ్యమును 1975లో నేనే అచ్చువేయించితిని. మాతాతగారి తాతగారైన గోపినాథవేంకటకవి పై ఉడుతభక్తిగా, వారి మారుతి శతకమునకు తాత్పర్యములు నేనే వ్రాసి, సర్వాంగసుందరముగ ముద్రించుచున్నాను. ఈశతకము ప్రజాదరణ పొందునని నా విశ్వాసము.

జీవితపరమార్థమును ప్రకటించు గోపీనాథ రామాయణపు క్రింది పద్యము వేంకటకవి మనస్థితి సంకేతము:

సీ|| రాజనందన శరీరప్రవర్తన మది, యంతలోఁగలుగు తానంతలోన
గుణదోషము లెఱింగి కుత్సితకర్మంబు, వర్జించి దేహి కేవలత ధర్మ
మాచరింపగఁబోలు నంగనాపుత్రగే, హారామవిత్తాదు లతనివెంటఁ
బోవు తాఁజేసిన పుణ్యపాపంబులు, దప్పక తనవెంటఁదగిలి వచ్చు

ఆ|| ఎఱుకగల మహత్ము లీ యర్థము గ్రహించి, పోవరానిత్రోవఁబోవనీక
మనసు నాఁగిపట్టి మహితధర్మమునందె, సంచరింతురెపుడు సత్యమింత

ఈ నివేదనమును ముగించునప్పుడు వేంకటకవి ఆర్తిని, శ్రీకృష్ణజన్మఖండ కథా భాగములోని దిగువ పద్యమునుండి గ్రహించుట సమంజసము.

సీ|| శ్యామసుందర రాధికామనోహర కృష్ణ, పరమేశ దేవ కృపాసముద్ర
నిజకర్మమయపాశనిగళబద్ధుండనై, క్రమలోనఁ బెక్కు జన్మముల నొ...
కడలేని సంసారజడధిలోన మునింగి, యేమియు దోచక యింతకాల
మునకు భవత్పాద వనజంబు లర్చించి, పొందుగా శరణంబు నొందినాడ
నన్ను కడతేర్చి ప్రోవు మనాథనాథ, భక్తి మంత్రక్రియావస్తుహీన
మైన మత్కర్మమెయ్యది దాని మోద, మలరఁబరిపూర్ణముగఁ జేయుమంబుజాక్ష

తెలుగు ప్రజల సంప్రదాయ చిహ్నముగ, గౌరవమును సూచించు 116 పద్యపుష్పములచే స్తుతించిన మారుతి శతకమును, వేంకటకవి 102వ వర్ధంతి సందర్భముగా తెలుగు ప్రజలకు సమర్పించుకొనుచున్నాను.

హైదరాబాదు
8-6-1994

గోపినాథ శ్రీనివాసమూర్తి

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్రార్పణమస్తు

శ్రీరామోజయతి　　హరిఓంనమశ్శివాయ　　శ్రీమదాంజనేయోజయతి

# మారుతి శతకము



శా. శ్రీమద్రామపదారవిందయుగళిన్ సేవించి, యస్మద్గురు
స్వామిన్ వేడ్క భజించి, సత్కవి నమస్కారంబుఁ గావించి, వా
గ్భామప్రౌఢిమ నీకు నొక్క శతకంబున్ భక్తి నర్పించెదన్
నామీదం గృపజేసి కైకొను మమందప్రీతితో మారుతీ. 1

1. స్వాతినక్షత్రంవలె ప్రకాశించే శ్రీ అంజనేయా! సీతాసమేతమైన శ్రీరామచంద్రమూర్తి పాదపద్మములను సేవించి, నా అజ్ఞానాంధకారమును పోగొట్టి కవిత్వవిద్యను ప్రసాదించిన యోగివర్యుడైన (నెల్లూరు జిల్లా జన్నవాడ సమీపపు వేదగిరి) లక్ష్మీనరసింహ స్వామి రూపమున ఉన్న శ్రీకృష్ణుని[1] భక్తితో స్మరించి, సత్‌పదసంపదచేత కావ్యసృష్టి కావించి, కవి అంటే వాల్మీకి అను అర్థముగ కీర్తి పొందిన ఆదికవి వాల్మీకి భగవానునకు నమస్కరించి పరబ్రహ్మస్వరూపమైన మాటల నేర్పుతో నూటపదునారు పద్యములుగల శతకమును భక్తితో నీకు సమర్పించుకొనెదను. దయచేసి ప్రీతితో స్వీకరింపుము స్వామీ!

మ. అనఘా. నీవు జనించి నప్పుడె సముద్యద్భూరితేజంబునన్
వినువీథిం గనుపట్టు బాలరవి సద్బింబంబు నీక్షించి. యె
ఱ్ఱని పండంచు గ్రసింప బత్రిపతిలీలన్ వేడ్క మున్నూరు యో
జనముల్ మింటికి దాటితౌఁ త్రిభువనశ్లాఘ్యుండవై మారుతీ. 2

1. శ్రీకృష్ణుడు యోగేశ్వరుడు, జగద్గురువు. వేంకటకవి సందర్శించినది వేదగిరి లక్ష్మీనరసింహస్వామిని. కలలో కాంచినది శ్రీకృష్ణుని. కనుక రుక్మిణీ కళ్యాణ ఘట్టమున 'శ్రీకృష్ణుని' పోతన 'పురుషసింహమ' అని సంబోధించుట, దానికి భాగవతమూలమున వ్యాసభగవానుడు 'నృసింహ' (దశమస్కంధము 52వ అధ్యాయము 'కాత్వాముకుంద' అను 38వ శ్లోకమున) ప్రయోగించుట అన్వయము చేసుకొనవలయును.

2. పువ్వుపుట్టగనే పరిమళించునట్లు నీవు పుట్టగనే ఎఱ్ఱగా ఉదయించుచున్న సూర్యుని చూచితివి. అది ఎఱ్ఱగాపండిన పం డనుకొంటివి. దానిని తిను తలంపుతో మూడువందలయోజనముల దూరమును గరుత్మంతుడు, లేక శ్రేష్ఠమైన(రామ) బాణము వెళ్ళునంత తేలికగా ఆకాశమునకు ఎగిరితివి. త్రిభువనములు అప్పుడు నిన్ను పొగడెను కదా మారుతీ!

మ. నిజగర్భస్థితశైవతేజము, సమున్నిద్రాత్మ తేజంబుఁ గూ
డ జగత్ప్రాణుఁ డమోఘ కేసరివనాటక్షేత్రమం దర్థి నిం
చ, జయశ్రీ మహిమాప్తి నయ్యుభయతేజంబుల్ రహిన్ మిశ్రమై
త్రిజగంబుల్ గొనియాడ బుట్టితివి గాదే నీ విలన్ మారుతీ. 3

3. జగత్తుల కన్నింటికి జీవయాత్ర సాగించుటకు వాయువు ప్రాణము. ఆవాయు దేవుడు గ్రహించిన శివతేజస్సును, వికసించిన తన (వాయు) తేజస్సుతో కలిపి, కేసరి అను వానరభర్తని ధర్మపత్ని అయిన అంజనాదేవి గర్భము నం దుంచెను. జయము, కీర్తి మహిమ (పార్వతీదేవి, లక్ష్మీదేవి మహిమలు కలుగునట్లు) శివ వాయు తేజముల కలయికచే పుట్టి, ముల్లోకముల పొగడ్తను పొందితివి కదా మారుతీ!

మ. అనిమేషేభము తెల్లపం డనుచు[1] బాల్యక్రీడలన్ మ్రింగ నొ
య్యన డాయం బవిచే బలారి నిను మూర్ఛాక్రాంతునిం జేయ బూ
ర్వనగాధిత్యక మీఁద వామహనువున్ భగ్నంబుగా వ్రాలినన్
హనుమంతుం డనుపేరు నా డమరె నీ కన్వర్థమై మారుతీ. 4.

4. దేవతల ఏనుగు (ఐరావతము) తెల్లనిది. అది ఇంద్రుని వాహనము. దానిని నీవు చిన్నప్పుడు చూచితివి. అది తెల్లపండు[1] అనుకొంటివి. పిల్లలు చూచినదంత తిందా మనుకునేటట్లు, దానిని మింగుటకు చూచుచుంటివి. అప్పుడు ఇంద్రుడు వజ్రాయుధముచేత దెబ్బవేసెను. ఆకాశముననున్న నీవు, ఆదెబ్బ తగిలి తూర్పు కొండ మీద పడితివి. అట్లు పడునప్పుడు, నీ ఎడమచెంప వంకర పోయి మూర్ఛతో పడిఉంటివి. అప్పటి నుండి నీకు హనుమంతుడు (చెక్కిలి మీద భాగము వంకరగ నున్నవాడు) అను పేరు ప్రసిద్ధికి వచ్చినది కదా మారుతీ!

1. ఉదయించు సూర్యబింబమును చూచి, ఎఱ్ఱనిపండు అని అనుకొని ఆకాశమునకు ఎగిరిన ఆంజనేయుని అదలించుటకు, దేవేంద్రుడు ఐరావతమును ఎక్కిరాగా, ఆంజనేయుడు ఐరావతమును తెల్లపండు అని భ్రమకొని, బాలచాపల్యంతో పట్టుకొనపోయినట్లు ఉత్తరరామాయణములో చెప్పిన విషయము ఇచ్చట గుర్తుచేసికొనవలెను.

మ. అప్పు డాగంధవహుండు నీ దయిన మూర్ఛావస్థ వీక్షించి, తా
గుపితుండై నిజమూర్తి వైభవము సంకోచింపఁగాఁ జేయ న
చ్చపు గూర్మిన్ నిఖిలాస్త్రశస్త్రముల బంచత్వంబు లేకుండ స
త్కృపతో నీకు వరంబు లిచ్చిరిగదా బృందారకుల్ మారుతీ. 5

5. అప్పుడు నీవు మూర్ఛతో పడిన బాధను చూచిన వాయుదేవుడు కోపగించెను. ప్రపంచ మంతా వ్యాపించిన తన వాయుప్రసారము వెనుకకు తీసికొనెను. (ఉపసంహరించుకొనెను) అప్పుడు గాలి లేక జీవములన్నియు సంకటపడెను. దానితో దేవతలు దిగివచ్చి అన్ని అస్త్రములు, అన్ని శస్త్రములచేత నీకు చావులేకుండునట్లు వర మిచ్చిరి కదా మారుతీ!

మ. ఒక పాదంబు మహోదయాచలముపై నొప్పారఁగా నుంచి వే
ఱొక పాదం బపరాద్రి మీఁద నిడి యయ్యుష్ణాంశుచే బల్విడిన్
సకలామ్నాయము లభ్యసించిన భవచ్చాతుర్య మే మందు దా
వక దివ్యోరుతర ప్రభావము నుతింపన్ శక్యమే? మారుతీ. 6.

6. సూర్యోదయమునకు పేరు పొందినది తూర్పుకొండ. సూర్యుని కనబడకుండ చేయునది పడమటికొండ. ఆ తూర్పుకొండపై ఒకకాలు పడమటి కొండపై ఒకకాలు పెట్టితివి. కాలము జరుగుకొద్దీ సూర్యుడు మారు స్థానమునకు అనువుగ దేహము కదల్చితివి. అట్లు వేదములు నేర్చితివి. అట్లు కదలింప గలిగిన నీ తొడల బలము. ప్రభావము నీ నేర్పరితనము పొగడవశమా మారుతీ!

మ. బలవంతుండగు వాలి ప్రోలు వెడలింపం, బత్నిఁగోల్పోయి మి
క్కిలి దుఃఖంబున ఘోరకాననములం గ్రీడించి వర్తించు నా
జలజాప్తాత్మజు నొజ్జ పట్టి యని యశ్రాంతంబుఁ జేపట్టి యా
బలభిత్పూతికిఁ జిక్కకుండ ననుకంపం బ్రోవవే మారుతీ. 7

7. వాలి అన్న. సుగ్రీవుడు తమ్ముడు. అన్నవాలి సుగ్రీవుని కిష్కింధాపురినుండి వెళ్ళగొట్టెను. కాని సుగ్రీవుని భార్యను మాత్రము తన (వాలి) వద్ద ఉంచుకొనెను. సుగ్రీవుడు అడవులపడి దుఃఖముతో తిరుగుచుండెను, అట్టి సుగ్రీవుని నీ గురువైన సూర్యుని కుమారుడు అని అభిమానించితివి. ఆ అభిమానముపైననే సుగ్రీవుని విడువక సేవించితివి. వాలి చేతిలో సుగ్రీవుడు ఎప్పుడు పడకుండా కంటికి రెప్పవలె కాచితివి కదా మారుతీ!

మ. తనపత్నిం దిలకింపుచున్ నిబిడకాంతారోర్వి వర్తించు రా
మ నరేంద్రోత్తము పాలి కర్కజుఁడు పంపం భిక్షువేషంబునన్
జని, సుగ్రీవుని చందముం దెలిపి యాక్ష్మానాథు దోడ్తెచ్చి, మె
ల్లన నయ్యిద్దఱకుం ధనంజయుని ప్రోలన్ సఖ్యసంబంధమున్
వినయం బొప్పఁఘటింప జేసినది నీవే కాదొకో మారుతీ. 8

8. శ్రీరాముడు తన భార్యను అడవిలో పోగొట్టుకొని వెదకుచు తిరుగు చుండెను. వారి ఆకారము చూచి భయపడిన సుగ్రీవుడు నిన్ను రామలక్ష్మణుల దగ్గరకు పంపెను. నీవు భిక్షు వేషములో వెళ్ళితివి. శ్రీరామునకు సుగ్రీవుని విషయము తెలిపితివి. వారిని నీవెంట తీసికొని. సుగ్రీవుని వద్దకు వచ్చితివి. శ్రీరామ, సుగ్రీవులకు మిత్రబంధమును అగ్నిసాక్షిగా చేసి నీ వినయము చూపితివి కదా మారుతీ!

మ. మనుజగ్రామణి సత్కృపాత్త కపిసామ్రాజ్య స్థితుండయ్యు భూ
తనయాన్వేషణ కార్యమున్ మఱచి కందర్పక్రియామత్తుఁడై
తనివిం జెందక యున్న భానుజునిఁ దత్కాలార్హ నీత్యుక్తయు
క్తిని బోధించిన నీతిశాలివి నినుం గీర్తించెదన్ మారుతీ. 9

9. శ్రీరాముని దయ చేతనే సుగ్రీవుడు రాజయ్యెను, అగ్నిసాక్షిగా సీతను వెదకించెద నన్న మాట రతిక్రియలో, పానక్రియలో పడి మరచెను. భోగలాలసుడైన అట్టి సుగ్రీవునికి కాలమునకు తగిన నీతి చెప్పితివి. విధిని నిర్వహించిన నీతిమంతు నిగా నిన్ను స్తుతించెదను మారుతీ!

శా. లేరా కీశు లనేకులుం? త్రిజగముల్ వీక్షించి రా నేర్పరుల్
గారా? రాముఁడు జానకిన్ వెదక వీఁకన్ గీశులం బంపుచో.
నారూఢిన్ భవదీయ దివ్యమహిమ వ్యాపారముల్ సూచి కా
దా! రత్నాంగుళి భూషణం బిడియె నీ హస్తంబునన్ మారుతీ. 10

10. సీతను వెదకుటకు పంపవలె నన్నచో వానరు లనేకులు లేరా? ఉన్నారు. వారిలో ముజ్జగములు చూచి తిరిగి రాగలిగిన నేర్పరులు లేరా? ఉన్నారు. అట్లున్నప్పటికీ రత్నములు చెక్కిన ఉంగరము శ్రీరాముడు నీ చేతికే గుర్తుగ ఎందుకిచ్చెను? శ్రీరాముడు ఆవానరులలో కార్యనైపుణ్యశక్తి, దివ్యమహిమ నీయందే కలవని ఖచ్చితముగ చూచికదా యిచ్చినది మారుతీ!

మ. వనజాప్త ప్రియపుత్రు డెంత ధిషణావంతుడొ, సర్వంసహా
తనయాన్వేషణ మాచరింప గపులం దా బంపుచో, గార్యసా
ధనమం దీ వతి దక్షుఁడం డ వని కాదా! నేర్పుతో దక్షిణం
బునకున్ ని న్నధికారిఁ జేసి పనిచెన్ మోదంబునన్ మారుతీ! 11

11. సూర్యుని కుమారుడైన సుగ్రీవుడు సీతాదేవిని వెదకుటకు వానరులను నలు దిక్కులకు పంపెను. అప్పుడు ఎవ రెవరిని ఏఏ దిక్కునకు పంపవలె నని తేల్చెను. ఆ సుగ్రీవుడు బలే తెలివి కలవాడు కదా! పని సాధించుటలో నీవు నేర్పరివి (దక్షుడవు) అని తెలిసికొనెను కనుకనే అంగదుని దక్షిణదిక్కునకు నాయకునిగా చేసెను. అట్లు చేసినప్పటికీ, నీపై కల అధికవిశ్వాసము చేత కదా, నిన్ను ముఖ్యునిగాచేసి (విశేషముగ పొగడి) పంపెను మారుతీ!

శా. సీతన్ గానక, దప్పిచే బడలి గాసిం జెందు శైలాట సం
ఘాతంబుం గొని, శైలగహ్వర సుధా కల్పాంబువుల్, సత్ఫల
వ్రాతంబుం దనివార నందఱ భుజింపంజేసి, తద్దేవతా
ఖ్యాతశ్వభ్రము వెల్వరించితివి యోగప్రౌఢిచే మారుతీ! 12

12. వానరులకు సీతాదేవి ఎంత వెదకినను కనబడలేదు. దక్షిణదిక్కున పోయినవా రందరు అలసట చెంది దప్పికచే బాధపడుచుండిరి. అట్టి వానరుల నందరి నీ స్వయంప్రభాదేవి గుహలోనికి తీసికొని వెళ్ళితివి. అక్కడ అమృతము వంటి చల్లని నీళ్ళుత్రాగించితివి. బాగుగ పండినపండ్లను తినిపించితివి. ఆదేవతా సంబంధమైన గుహలోనికి వెళ్ళిన వారు ప్రాణములతో తిరిగిరాలేరు. అట్టి గుహనుండి స్వయంప్రభాదేవి యోగమాయచేత బయటికి తెప్పింప చేసినది నీవేకదా మారుతీ!

మ. జనకక్ష్మాపతిపుత్రి యున్నవిధమున్ సర్వంబు సంపాతిచే
విని, నీలాంగదముఖ్యవానరవరుల్ వేగంబె ప్రాయోపవే
శనమున్ మాని భవ త్సమేతులగుచున్ సంప్రీతితో నా మహేం
ద్రనగారోహణ మాచరించి రఁట విన్నాణంబుగా మారుతీ. 13

13. సుగ్రీవుడు సీతను చూచి తిరిగి వచ్చుటకు పెట్టిన గడువు అయిపోయింది. కాని చూడవలసినవి ఇంకాచూడలేదు. చూచినంతలో సీతకనబడలేదు. అంగద, నీలముఖ్యవానరుల కామాట సుగ్రీవునితో చెప్పుటకు ధైర్యము చాలలేదు.

సుగ్రీవుని ఆజ్ఞకు భయపడినవారైరి. కనుక ప్రాణత్యాగము చేయుటకు నిశ్చయించి చచ్చువరకు అన్నము తినక ప్రాయోపవేశనము చేయుచుండిరి. అట్లు చేయుచు తమ దీనపరిస్థితి తలచుకొని దుఃఖించుచుండిరి. ఆతలచుకొనుటలో జటాయువు వీరమరణము పదేపదే చెప్పి దుఃఖించుచుండిరి. దానిని వినిన జటాయువు సోదరుడు సంపాతి, విషయము నడిగి వానరులనుండి తెలుసుకొనెను. సీత లంకలోనున్న సంగతి వానరులకు సంపాతి చెప్పెను. దానిని విని వానరులు ప్రాయోపవేశనము మానిరి. నీల, అంగదాదులు నీవెంట మహేంద్ర పర్వతము నెక్కిరి కదా మారుతీ!

మ. శరధిం గాంచి యలంఘనీయ మని తత్సంతారణాదక్షులై
వరుసన్ గీశులు భీతిచేఁ గళవళింపన్ వారి వారించి ని
న్నురుపాథోధివిలంఘనక్రమునిఁగా నూహించి ధీమంతుఁడౌ
పరమేష్ఠిప్రియపుత్రుఁడంచితగతిన్ బ్రార్థింపడే మారుతీ! 14

14. వానరులందరు సముద్రమును చూచి అవతలిగట్టు చేరుటకు శక్తిలేదని భయపడుచుండిరి. అట్లు కలవరపడుచున్న వానరులకు బ్రహ్మదేవుని పుత్రుడైన జాంబవంతుడు నచ్చజెప్పెను. నీపుట్టు పూర్వ వివరములు చెప్పి నీవే సముద్రము దాటివచ్చు శక్తియుక్తులు కలవాడవని నిన్ను తగినరీతిగా ప్రార్థించెను కదా మారుతీ!

శా. "ఏలా మీకు భయంబు నేఁ గలుగ మీ రిందుండుఁ డే నొక్కఁడన్
వాలాయంబు పయోధి దాటి యనువొందన్ లంకలో జానకిం
బోలం గన్గొని వత్తు. నిత్తు బరమామోదంబు మీ" కంచు ధై
ర్యాలాపంబులు వల్కి తేర్చితివి గాదా కీశులన్ మారుతీ. 15

15. అప్పుడు నీవు " నేనున్నాను, మీకు భయమెందుకు? మీరందరిక్కడే ఉండండి నే నొక్కడనే సముద్రమునుదాటి, లంకలో సీతను చూచి వచ్చెదను. మిమ్ము సంతోషపరచెదను" అని ఊరడించు ధైర్యపు మాటలు పలికి వారి భయము పోగొట్టితివి కదా మారుతీ!

మ. బలి బంధించిననాఁటి వామన తను ప్రాబల్యముం దాల్చి యు
జ్జ్వలచంద్రోదయవేళఁ బొంగు తటినీశస్ఫూర్తి నుప్పొంగి ఘో
రలయాభ్రంబు తెఱంగునన్ భయదగర్జారావముం జేసి త
జ్జలధిం దాటఁగఁ బూని తీవు పరమోత్సాహమ్మునన్ మారుతీ. 16

16. వామనుడు బలి చక్రవర్తిని బంధించుటకు తన శరీరమును పెంచి ముల్లోకము ల్నాక్రమించెను. పౌర్ణమిరోజు ఉదయించుచున్న సంపూర్ణచంద్రుని చూచి, సముద్రము బాగుగ ఉప్పొంగును. వామనునివలె శరీరము పెంచుశక్తి, సముద్రునివలె ఉప్పొంగుశక్తి, నీవు దాల్చి, కాలమేఘము గర్జించినట్లు భయంకర గర్జన చేసి, మహాసంతోషముతో సముద్రమును దాటుటకు ఉత్సాహమున ఎగిరితివి కదా మారుతీ!

మ. స్థిరసత్త్వంబున శైలరాజము ధరిత్రిం గ్రుంగఁ బాదంబు లూ
ది, రహిన్ భూరిభుజోరు వేగమున ధాత్రీజాతముల్ పెల్లగి
ల్లి రయం బారఁగఁ దోడ రా, గగనమున్ లీలాగతిన్ మ్రింగ సు
స్థిరశక్తిం జనుమాడ్కి దాటితివి గాదే నింగికిన్ మారుతీ. 17.

17. కదలక (తొణకక) నిల్వద్రొక్కుకొనిన నీపాదములతో, మహేంద్రపర్వతమును క్రుంగిపోవునట్లు అణగద్రొక్కితివి. నీ భుజము, కాలు తొడలు, వేగముగ కదలించితివి. అట్లు కదలించుటచే పుట్టిన తీవ్రమైన గాలితో, చెట్లు వేళ్ళతోసహా పెకలించుకొని ఆకాశమువైపు తేసుకొని వచ్చినవి. అట్లుపైకి లేచివచ్చిన చెట్లు, తోడురాగా, స్థిరమైన శక్తితో ఆకాశమును మింగుటకు వెళ్ళుచున్నట్లు, ఆకాశమున కెగిరితివి కదా మారుతీ.

మ. అగజాలావృతమూర్తివై భుజరయోద్యద్వారివాహంబు లో
ప్పుగ నిర్వంకల నంటి రా గదలి యంభోరాశిమధ్యంబునన్
గగనాధ్వంబున నేగు ని న్ననిమిషుల్, గంధర్వులున్ లంబ ప
క్షగిరీంద్రంబును బోలె జూచిరికదా సంభ్రాంతులై మారుతీ! 18

18. చెట్ల సమూహముచేత చుట్టబడిన ఆకారము కలవాడవైతివి. నీ చేతులఁ నకు చెదరిన మేఘములు, నీ రెండువైపుల నున్నవి. అట్లు చెట్లు, మేఘ నీవెంట వచ్చినవి. అట్లు సముద్రమధ్యలో ఆకాశమును దూసుకొని వెళ్ళు దేవతలు, గంధర్వులు చూచి "ఏమియిది వ్రేలాడు రెక్కలు కలిగిన పర్వత అని తత్తరపడిరి కదా మారుతీ!

శా. లోకాలోకగుహాముఖంబులు బదుల్ప్రోయంగ నుద్వృత్తి న
స్తోకధ్వానమొనర్చి, వజ్రనిభవక్షోఘట్టనస్ఫూర్తి మై
నాకంబున్ నుడిబెట్టి దాని పిదపన్ మన్నించి కేలూది ప్ర
త్యేకం బా బలవైరిచేత నభయం బిప్పింపవే మారుతి. 19

19. భూమిని చుట్టుకొని చక్రవాళపర్వతములున్నవి. అచ్చక్రవాళ పర్వత గుహాద్వారములు ప్రతిధ్వనించునట్లు, నీవు సింహగర్జన చేసి విజృంభించితివి. అట్టి వైభవముతో, సముద్రమధ్య ఆకాశమున వెళ్ళు నీ బడలిక తీర్చుకొరకు, మైనాక పర్వతము సముద్రములోనుండి పైకి లేచి వచ్చినది. నీకు విశ్రాంతి యిచ్చుట కట్లు వచ్చు పర్వతమును, వజ్రాయుధముతో సమానమైన నీరొమ్మునతాకిడి ఘర్షణతో, (అమైనాకుని) తిప్పలు పెట్టితివి. పిమ్మట అమైనాకుడు చెప్పిన మాటలు విని. దానిని మన్నించి, చేతితో తాకి, భయము లేకుండ చేసితివి. దానికీ మెచ్చి ఇంద్రునిచేత భయములేక స్వేచ్ఛగా తిరుగువరము నిప్పించితివి కదా మారుతీ!

మ. గరిమన్ వేల్పులు నీదుశక్తి దెలియం గాంక్షించి, నాగాంబయౌ
సురసం బంపిన వ్యాపితాస్య యగుచుం జొప్పాగి పోనీక ముం
దఱం దోతెంచిన, సూక్ష్మమూర్తివగుచుం దద్వక్త్రముం జొచ్చి గ్ర
మ్మర నేతెంచిన యోగసిద్ధుని నినుం బ్రార్థించెదన్ మారుతీ. 20

20. దేవతలు నీ శక్తి పరీక్షించుటకు సురస అను నాగమాతను పంపిరి. ఆమె నిన్ను పోనివ్వక అడ్డముగ నిలచి నోరు తెరచినది. నీవు అనోరు మించు దేహము కలవాడవైతివి. అనాగమాతకూడ నోటిని పెంచెను. నీవుదేహమును మరింత పెంచుతూ అనాగమాత నూరుయోజనముల నోటినిగా పెంచునట్లు చేసితివి. అప్పుడు నీవు ఉన్నట్లుండి సూక్ష్మదేహస్థుడవై నాగమాత నోటిలో ప్రవేశించి, కడుపులోనికి పోయి, వెంటనే వెడలి వచ్చితివి. అట్టి యోగసిద్ధుడవైన నిన్ను నేను ప్రార్థించెదను మారుతీ!

మ. పటుపాథోధి తరంగ పంక్తులు గణింపం బోవు చందాన ను
త్కటవేగంబునఁ బోవు నిన్నుఁ గని వేల్పున్ వీతసందేహులై
చటుల స్థైర్యబలద్యుతిస్యదమతుల్ శౌర్యంబు ధైర్యంబు మి
క్కుట మౌఁగా కని నీ కొసంగిరె దివౌకుల్ దీవనల్ మారుతీ 21

21. సముద్రపు అలలను లెక్కపెట్టుటకు వెళ్ళువానివలె ఆకాశమున కెగిరితివి. సందేహములేక అట్లు వేగమున వెళ్ళునిన్ను దేవతలు వేడుకగా చూచి దేవకార్యమును నీవు సాధించగలవా? అన్న సందేహము వీడిరి. దేవతలు మెచ్చి నీకు చలించని శక్తి, బలము, తేజస్సు, వేగము, బుద్ధి, శౌర్యము, ధైర్యము వృద్ధియగు గాక అని నిన్ను దీవించిరి కదా మారుతీ!

మ. పవనాభస్యద మొప్ప నీవు కడిమిం బాథోనిధిం దాటుచో
భవదీయోరు భుజోరువేగజనితాభంగోర్మికాజాలముల్
దివితో రాయ ఘుమంఘుమార్భటులు దిగ్దేశంబులం బర్వఁ బ
త్రవహేంద్రుం డని భీతిలెన్ ఫణులు పాతాళంబునన్ మారుతీ. 22

22. వాయువుతో సమానమైన వేగముతో సముద్రమును దాటితివి. అట్టి వేగము వచ్చుటకు నీతొడలు, కాలు, చేతులు వేగవేగముగ కదలించితివి. దాని వలన పుట్టిన ఎడతెగని వాయు తరంగముల వరుసలు మీదిమీదికి పోయి ఆకాశముతో రాపిడి చేసినవి. ఆ రాపిడితో 'ఘుం, ఘుం' అను శబ్దములు అన్ని దిక్కుల వ్యాపించినవి. ఆశబ్దమును విన్న పాతాళలోకములోని పాములు, గరుత్మంతు డెగిరివచ్చు శబ్దమని ప్రాణభయమును పొంది దాగినక్కినవికదా మారుతీ!

మ. శరదశ్రేణుల దూరుచున్ వెడలుచుం జాబిల్లి చందానఁ బు
ష్కర మార్గంబున నేగు నిన్నుఁ గని నీ చాతుర్యమున్ మెచ్చి ని
ర్జరు లానంద మెలర్పఁ జల్లిన మరుత్సంతానపుష్పంబుల
ట్లరుదారన్ గనసయ్యెఁ జుట్టును సముద్యత్తారకల్ మారుతీ! 23

23. మేఘముల వరుసలలో అనేకపర్యాయములు దూరుచు తిరిగివచ్చుచు, మళ్ళీ ఇంకొక మేఘములో దూరుచు మళ్ళీ వచ్చుచు, చంద్రుని వలెనున్న నిన్ను దేవతలు చూచిరి. అట్టి నీ చాకచక్యమునకు దేవతలు సంతోషించి మెచ్చి ఆశీర్వదించిరి. ఆ ఆశీర్వాదములతో చల్లిన కల్పవృక్ష పుష్పముల వలె నీచుట్టును నక్షత్రములు ప్రకాశించినవి కదా మారుతీ!

శా. ఛాయాగ్రాహిణి నామరాక్షసి సరస్స న్మధ్యమం దుండి నీ
కాయచ్ఛాయను బట్టి పేఁ దిగువఁ దద్గర్భంబు భేదించి త
త్కాయంబుం గొని మింటిపై కెగసి కిన్కన్ వార్ధిలో జీవితా
పాయంబుం గలుగంగ వైచిన నినున్ వర్ణించెదన్ మారుతీ. 24

24. నీడనుపట్టిలాగు రాక్షసి ఛాయగ్రాహిణి. దాని పేరు సింహిక. అది సముద్రములో నుండి ఆకాశముపై పోవు ని న్నాకర్షించి లాగినది. అప్పుడు నీకు సుగ్రీవుడు చెప్పిన విషయంతో అది ఛాయాగ్రాహిణి అని తెలుసుకొన్నావు. వెంటనే నీవు ప్రళయకాలములో అంతకంతకు దేహముపెంచు ఉగ్రమూర్తివలె నీ శరీరము పెద్దది చేసినావు. అది దానినోరు నీశరీరాన్ని మించి పెంచింది. అట్లు దాని నోరు

పెంచగనే నీవు పెంచుతూ వచ్చి ఉన్నట్లుండి దాని కడుపులోనికి సూక్ష్మరూపమున దూకి వెళ్ళి, నీ శరీరాన్ని పెంచుతూ పైకి లాక్కుని పోయి, దాన్ని సముద్రములో విసరివేశావు. అట్టి నిన్ను వర్ణించెదను మారుతీ!

శా. మైనాకంబు నతిక్రమించి, సురసన్ మన్నించి, యాసింహికా
ఖ్యానన్ రాక్షసిఁ గీ టడంచి నడుమన్ గాలూద కస్తాద్రికిం
భానుం డేగకమున్నె, మారుతగతిన్ వారాశి నూఱామడన్
గ్లానిం జెందక దాటి తీవు సురసంఘం బెన్నఁగా మారుతీ. 25

25. మైనాకుడిని దాటి, సురసను గౌరవించి, సింహిక గర్వాన్ని రూపుమాపి చంపితివి. సముద్రముపై కెగరినప్పటినుండి మధ్య ఆగక సూర్యాస్తమయమునకు ముందే, సముద్రపు ఆవలి తీరమైన లంకాపురము చేరితివి. 'నూరామడల సముద్రమును వాయువు దాటినంత అవలీలగా దాటి, అలసట చెందలేదు' అని దేవతలు మెచ్చునట్లు లంక చేరితివిగదా మారుతీ!

మ. అనఘా, భాస్కరు డొక్కమా ఉదయశైలాగ్రంబునం దుండి య
స్తనగాగ్రంబున కేగునంతకు సముద్యచ్ఛక్తి వేమాఱు బె
ల్పన నక్కొండల రెండునుం దిరుగు తేజశ్శాలికిన్ నీకు చ
య్యన నూఱామడ దాటు టేమి విషయం, బన్తోకమే మారుతీ! 26

26. (ఎవ్వరు దూషించుటకు ఎట్టి) దోషములు లేనివాడా! సూర్యుడు తూర్పుకొండ నుండి పడమటి కొండ చేరునంతలోపల, వాటిమధ్య పెక్కుమార్లిటు నటు తిరుగు తేజశ్శాలివైన నీకు, ఒక నూరామడల దూరము దాటు టొక చెప్పదగిన విషయమా? మారుతీ!

మ. తతవేగంబున వార్ధి దాటి గడిమిం దద్యామ్యతీరస్థ ప
ర్వతముం జేరి నగోపమాననిజగాత్రవ్యాప్తి జాలించి, ని
ర్గతమోహుండగు యోగిభంగిc బ్రకృతిం బ్రాపించి, లంకాపురీ
స్థితసర్వంబును బోల జూచితివి గాదే దవ్వులన్ మారుతీ. 27

27. అంతటి వేగముతో సముద్రమును దాటితివి. దక్షిణతీరమున నున్న పర్వతమును చేరితివి. మోహమును విడిచిన యోగివలె కొండ వలె పెంచియున్న దేహాన్ని మామూలుగ చిన్నదిగ చేసితివి. అట్టి చిన్న శరీరముతో లంకా పట్టణము నంతనూ దగ్గరనుండే చూచితివి కదా మారుతీ!

శా. పంకేజాసను శాసనంబున జయింపన్‌రాక య్యశ్రాంతమున్
లంకాద్వారముఁ గాచియున్న కుపితన్ లంకన్ జయాంకన్ నిరా
తంక ప్రౌఢి నశంకముష్టిహతి చేతం దూలఁగాఁ బుచ్చి, వీ
రాంకగ్రామణివై వెలింగెడు నినున్ బ్రార్థించెదన్ మారుతీ. 28

28. బ్రహ్మదేవుని శాసనము ననుసరించి, లంక అనుపేరుగల రాక్షసి లంకాపుర మును రక్షించుచున్నది. అది జయము తప్ప, అపజయము రుచి ఎరుగదు. అట్టి గర్వముచే విఱ్ఱవీగు లంక, నిన్ను చూచి కోపము తెచ్చుకొనినది. నీవు ఆరాక్షసిని పిడికిటిపోటుతో, నేర్పుగా పొడిచి ఓడించితివి. అట్టి వీరాగ్రేసరుడవైన నిన్ను నేను ప్రార్థించుచున్నాను మారుతీ!

శా. ప్రాచుర్యంబుగ చందురుండు కిరణవ్రాతంబు పైజల్లుచున్
సాచివ్యం బొనరింప యోగమహిమన్ మార్జాలమాత్రుండవై
నీచుల్ దైత్యులు చూడకుండ సతి నన్వేషింపగా శేముషీ
వైచిత్రిన్ వెస లంక డాసిన నినున్ వర్ణించెదన్ మారుతీ. 29

29. రాత్రిలో సీతను వెదకుచున్న నీకు, స్నేహితుని వలె చంద్రుడు తన పాలవన్నె వెన్నెల చేత, సహకరించెను. నీవు యోగశక్తిచేత, పిల్లి అంతటి సూక్ష్మరూప మును ధరించితివి. రాక్షసులకు కనబడకుండ, లంకాపురములో ప్రవేశించి, వెదకిన నీ బుద్ధి కుశలతను, నేను వర్ణించు చున్నాను మారుతీ!

శా. లంకానామనిశాటి నాకరణిఁ దూలం బుచ్చి య్యాప్రో లిఁకన్
గంకోలూక వశంబు గాగలదు నిక్కం బంచు వామాంఘ్రి ని
శ్శంకన్ ముందుగ బెట్టుచున్ సురభి ళాంచద్రాజమార్గంబునన్
లంకాకాననవహ్నివై చనవె ధీరత్వంబునన్ మారుతీ. 30

30. లంక అను పేరుగల రాక్షసిని, ఈవిధముగ ఓడించితివి. మంచి వాసనలు గుబాళించు లంకాపుర రాజవీధులలో, ఎడమకాలు ముందుపెట్టి వెళ్ళితివి. ఎడమకాలు ముందు పెడుతూ "ఇంతవైభవముగ వాసనలు వెదజల్లు లంక, రాబందులు, గుడ్లగూబలకు వశము కాగలదు" అని పలికి, లంక అను అడవిని కాల్చుటకు పుట్టిన అగ్నివలె, నీవు లంకాపురము లోనికి వెళ్ళితివి కదా మారుతీ!

శా. నానావర్ణవికారరూపులను నానావేషులన్ దైత్యులన్
నానా ఘోరశరీరులం గనుచు నానాగుల్మముల్ జూచుచున్
నానావాద్యరవంబులన్ వినుచు, విన్నాణంబుగా రాఘవో
ర్వీనాధప్రియపత్ని భూమిసుత నన్వేషింపవే మారుతీ. 31

31. అనేక శరీరవర్ణములు, అనేక మనోవికారములు కలిగిన రాక్షసులను, అనేక వేషములు ధరించిన రాక్షసులను, భయంకరశరీరములు అనేకములు కలిగిన రాక్షసులను, చూచితివి. ఇట్లు, అనేక విధములుగా రక్షణచేయుచున్న రాక్షస రక్షక భటులను, చూచితివి. అనేక రకములైన వాద్యరవములను, వినుచుంటివి. అట్లు చూచుచు, వినుచు, శ్రీరాముని ధర్మపత్ని సీతాదేవిని, ఎంతో చాతుర్యముగ వెదకుచుంటివి కదా మారుతీ!

శా. సాహంకారత దానవుల్ సలుపు వీరాలాపముల్ గాంత లు
త్సాహం బొప్పంగఁ జేయు గానములు మంత్రజ్ఞాసురప్రేరిత
స్వాహానాదము లాలకింపుచు నవాచ్యం బీపురీవైభవం
బాహా! చిత్ర మటంచు మెచ్చుకొనవే స్వాంతంబునన్ మారుతీ. 32

32. వీరగర్వంతో రాక్షసులు చేసే వీరాలాపములు, పరవశమున రాక్షసస్త్రీలు పాడు పాటలు, అగ్నియందు హవిస్సు వేస్తూ "స్వాహ" అని నాదయుక్తముగ మంత్రవేత్తలు పలుకు శబ్దములు వినుచు "అహా! ఈ పట్టణవైభవము, ఎంత చిత్రము! వర్ణింప శక్యముకాదే'అనుకొంటూ నీమనస్సులో మెచ్చుకొంటివి కదా మారుతీ!

మ. వరుసన్ గ్రంతలు రచ్చచావడులు భాస్వచ్చైత్యముల్ భూరిగో
పురముల్ మేడలు పుణ్యవీధులగముల్ భూమీగృహశ్రేణులున్
హరిజిత్కుంభ నికుంభులున్ శుకుడు, యూపాక్షాసురుం డాదియౌ
సురవిద్వేషుల చారుమందిరములన్ శోధింపవే మారుతీ. 33

33. సందుత్రోవలు (క్రంతలు), సభచేయుచావడులు (కొలువుకూటములు), ప్రకాశించు మంటపములు (భాస్వత్‌చైత్యముల్), పెద్దగోపురములు మేడలు, దేవాలయముల, పుణ్యనదులకు దారితీయు వీధులు (పుణ్యవీధులగముల్). భూగర్భ గృహములు వరుసగా చూచితివి. ఇట్లు ఇంద్రజిత్తు, కుంభ,నికుంభ, శుక, యూపాక్ష రాక్షసుల సుందరమందిరములను వెదకితివి కదా మారుతీ!

మ. చలమొప్పన్ దశకంఠరాక్షసనివేశంబుం బ్రవేశించి యం
దు లతామందిరముల్ దివాగృహకముల్ తోరంపుక్రీడాగృహం
బులు, చిత్రావసదంబులున్ మణిగృహంబుల్ చారుశయ్యాగృహం
బులు వీక్షింపుచు నంతటన్ వెదకవే భూపుత్రికన్ మారుతీ. 34

34. సీతాదేవిని వెదుకుతూ, రావణమందిరము లోనికి వెళ్ళితివి. తీగలతో చుట్టుకొని యున్న (వెలుగులేని) మందిరములు, పగటి వెలుగు వలె నున్నగదులు (దివాగృహకములు) విలాసమందిరములు, చిత్రశాలలు, మణిమందిరములు, సుందరపడకగదులు చూచుచు సీతాదేవి కనబడునేమో యని అంతట వెదకితివి కదా మారుతీ!

మ. నలువొప్పం గమనీయ పుష్పకవిమానంబుం దగం జూచి యు
జ్జ్వల నానావిధధూపవాసనలు దివ్యస్రక్సుగంధంబు లిం
పలరారం బ్రియబంధునిం బలె సముద్యత్ప్రీతి రమ్మంచు నిం
జెలిమిం బిల్వంగ నేగుదెంచినక్రియన్ జెంతం గుబాళింప ద
ద్విలసద్దివ్యగృహంబు జేరితివి కాదే మెల్లనన్ మారుతీ. 35

35. మారుతీ! నీవు సుందరమైన పుష్పకవిమానమును, బాగుగ చూచితివి. అది చూచునపుడు, సాంబ్రాణి, అగరువత్తులు మొదలైన ధూపవాసనలు, దివ్యములైన పువ్వుల నుండి వచ్చే మంచి వాసనలు, ప్రియబంధువులను ప్రీతితో రమ్మని పిల్చినట్లు, నిన్ను పిలిచినవి. ఆవీచిన వాసనలతో రావణుని దివ్యమందిరమును, మెల్లగా చేరితివికదా, మారుతీ!

మ. అమరారాతికిఁ బ్రీతిగా వివిధవాద్యధ్వానముల్ చేసి పా
నమదావేశము చేత మైమఱచి నానాచేల భూషాఢ్యలై
క్రమతన్ జాల్గొని సుప్తవాహినుల లీలం గూర్కు కాంతానికా
యముల న్గన్గొని ధర్మలోపభయముం బ్రాపించి నీ వాత్మలో
విమలప్రజ్ఞున కేల శంక? యని యన్వేషింపవే మారుతీ. 36

36. రావణప్రీతి కొరకు అనేక వాద్యములను వాయించి, తాగిన మద్యంతో ఒళ్ళు మరచిన స్త్రీలను, చూచితివి. ఆస్త్రీలు, అనేక రకములైన చీరలు, ఆభరణములు ధరించి, బారులుతీరి నిదురించుచున్న కదలికలేని నదులవలె పరుండి ఉండిరి.

అట్టి స్త్రీలను చూచి "నిదురించుచున్న పరస్త్రీల గోప్యమర్మములు చూచితిని కనుక ధర్మలోపము కలుగ చున్నది" అను భయమును పొందితివి. అంతలోనే తేరుకొని "అన్ని ఇంద్రియముల ప్రవర్తనకు కారణము మనస్సు. మనస్సుతో ఇంద్రియము కలిసి నపుడే, దోషములు గలుగును. నామనస్సు కామపు చూపుతో పరస్త్రీలను చూడలేదు. సీతాదేవిస్త్రీ. స్త్రీలను స్త్రీలలోనే వెదుకవలె. నేను మలినము లేని మనస్సుతో, ఈస్త్రీల నందరినీ చూచితిని. కనుక ఎట్టి ధర్మలోపము ఉండదు" అని నిశ్చయించి, సీతాదేవిని వెదకితివి కదా మారుతీ

మ. కమనీయోన్నత పుష్పతల్పముపయిం గన్మోసి గుర్వెట్టు పం
క్తిముఖున్ నీలఘనాభదేహు గని తత్తేజంబునన్ రత్నదీ
పములం దద్గృహ మెల్ల వెల్గు చునికిన్ భావంబునన్ మెచ్చుచున్
సముదంచద్గతి నచ్చటన్ వెదకవే క్ష్మాపుత్రికన్ మారుతీ. 37

37. ఎత్తైన పువ్వుల పరుపుమీద నల్లని దేహపు రావణుడు గురకలు పెట్టి నిద్రించు చుండెను. రావణుని దేహ కాంతి చేతను, శ్రేష్టమైన (రత్న) దీపముల చేతను రావణుడు పండు కొనిన గదియంతయు వెలుగు చుండెను. దానికి మెచ్చు కొనుచు, సీతాదేవి నక్కడ చక్కని పద్ధతిలో వెదకితివి కదా మారుతీ!

మ. సరసాన్నంబులు పక్వమాంసచయముల్ సౌరభ్య సంవాసిత
స్ఫురదుచ్చావచ మద్యపూరితఘటంబుల్, మాల్యముల్ నిద్రితా
సురకాంతల్ గల పానశాల గని యచ్చో రాఘవ ప్రేయసిన్
సురకాంతాసదృశన్ విదేహతనయన్ శోధింపవే మారుతీ. 38

38. మెత్తగా ఉడికిన రుచికరములైన ఆహారములు, బాగుగ ఉడికిన మాంసపు ముక్కలు, రకరకములైన సువాసనలను కలిగిన మద్యములు కలిగిన మధు పాత్రలు, పూలదండలు, నిద్రించుస్త్రీలు ఉన్న పానశాలను చూచితివి. అక్కడ నీవు దేవకాంతవంటి తేజస్సుకలిగిన సీతాదేవి కొరకు వెదకితివి కదా మారుతీ!

మ. అరవిందోత్పల కైరవోదరమరందాస్వాదనోన్మత్తబం
భరమాలా పరిషన్మనోజ్ఞమధురధ్వానాభిరంజత్ సరో
వరతీరంబులఁ బుష్పపల్లవ ఫలవ్రాతాగ్రధాత్రీరుహో
త్కరమూలంబుల నేర్పునన్ వెదకవే ధాత్రీసుతన్ మారుతీ. 39

39. తెల్ల తామరల, నల్లకలువపూల, తెల్లకలువపూలలోని తేనెను త్రాగి మత్తెక్కిన తుమ్మెదల గుంపు, వీనుల విందైన మధురధ్వనులు చేయుచుండెను. అట్లు విలసిల్లు సుందర సరోవరతీరములందు పూచిన పూలు, చిగుళ్లు, పండ్లు కలిగిన చెట్ల మూలములందు సీతాదేవికొరకు వెదకితివి కదా మారుతీ!

శా. ఈలీలన్ దశకంఠుపట్టణములో నేపారఁగాఁ బెక్కు చం
దాలం గే లిడునంత భూమితల మైనం దప్పకుండంగ నీ
వాలోకించి మహీజఁ గానక నిజస్వాంతంబులోఁ గొంతసే
పాలోచింపవె స్వామికార్యఘటనావ్యాపారమున్ మారుతీ. 40

40. రావణుని లంకాపురమున చేయిపెట్టునంత భూమి నైన వదల కిట్లు సీతాదేవిని వెదకితివి. ఆవిశాల నగరమున సీతాదేవి కనబడలేదు. అప్పుడు శ్రీరామ కార్యము నెరవేర్చుటకు చేయవలసిన పనులను నెమరువేసుకొంటివి కదా మారుతీ!

శా. కంటిం జారణ సిద్ధ కిన్నర మరు ద్గంధర్వ కాంతావళిన్
గంటిన్ మానవయోషలన్ బవనభుగ్రామా లలామంబులన్.
గంటిన్ సర్వనిశాచరప్రమదలన్ గంటిం బురంబందు నే
వెంటం జానకిఁ గాననైతి నని నిర్వేదింపవే మారుతీ. 41

41. 'రాక్షస, చారణ, సిద్ధ, కిన్నర, దేవతలు, గంధర్వ మానవ, నాగస్త్రీల నందరను చూచితిని. కానీ సీతాదేవి ఎక్కడ కనబడలేదే' అని చింతపడితివి, కదా, మారుతీ!

శా. ఈలంకాపురరాజ మందుగల చో ట్లెల్లన్ సమగ్రంబుగా
నాలోకించితి నింక నొక్కవన మీయంతఃపురాభ్యానమం
దాలేఖేశవనంబుమాడ్కిఁ గడు హృద్యంబై రహిం గ్రాలెడిన్
బాలారత్నము నచ్చటన్ వెదకెదం గా కంచు డెందాన నీ
వాలోచించి రయంబు మీరఁ జనవే యచ్చోటికిన్ మారుతీ. 42

42. ఈలంకాపుర మందుగల చోటు లన్నిటినీ పూర్తిగా చూచితిని. ఇంకచూడక మిగిలినది రాజాంతఃపురములో నున్నతోట. అది దేవేంద్రుని నందనవనమువలె నేత్రములకు, మనస్సునకు ఆనందము కలిగించుచున్నది. సీతాదేవి నక్కడ వెదకెదను గాక, అని నీమనస్సులో ఆలోచించి, అచ్చటికి వెళ్ళితివి కదా మారుతీ!

మ. వనముజ్మండలిఁ జొచ్చుచంద్రుని గతిన్ బ్రచ్ఛన్నవేషంబుతో
వనముం జొచ్చి లతాగృహోత్కర తరువ్రాతంబులన్ దీర్ఘికల్
ఘనసౌధంబులు చూచుచున్ జని మరుత్కల్పుండవై శింశుపా
ఖ్యనగారోహణ మాచరించితివి గాదా నేర్పునన్ మారుతీ. 43

43. మేఘమండలములోపల వెళ్ళి కనరాని చంద్రుని వలె కప్పబడిన (మారు) వేషముతో ప్రవేశించి, తీగలచే గది వలె అల్లుకొనిన పొదరిండ్లు, చెట్లగుంపులు, దిగుడుబావులు, పెద్ద భవనములు చూస్తూ శింశుప అను చెట్టుపైకెక్కి, ఆకుల గుబురున కనబడని వాయుదేవుని వలె అశోకవనమున దాగియుంటివి కదా మారుతీ!

మ. తరుణిం గ్రీష్మగభస్తి, తప్తలతచందానన్ రహిన్ వాడి భీ
కరదైత్యాంగన లాడు మాటలకు నాకంపించుచున్ సారెకున్
జిరభక్తిన్ రఘురామ, రామ, యనుచుం బేర్కొంచు శోకార్తయై
తరుమూలంబున నున్న జానకిని, సందర్శింపవే మారుతీ. 44

44. ఎండాకాలపు సూర్యుని కిరణముల వేడికి వాడిన తీగవలె, వాడిన ముఖముతో మంచి యౌవనవయస్సున నున్న సీతాదేవిని, చూచితివి. భయంకరమైన రాక్షసస్త్రీలు సీతాదేవిని, భయపెట్టుటను కూడ, చూచితివి. ఆ బెదరింపులకు వణుకుచు 'రఘురామ! రామ!' అనుచు దీనముగా చెట్టు మొదలున పలుకు చుండిన, సీతీదేవిని చూచితివికదా మారుతీ!

మ. కమనీయాకృతి శింశుపాఖ్యతరుశాఖాపర్ణలీనుండవై
యమరారాతి దశాస్యు డన్న కటుక్రూరాలాపముల్ రాక్షస
ప్రమదల్ వల్కు దురుక్తు లంత త్రిజటాస్వప్నప్రకారంబు న
య్యమ గావించు విలాప మంతయును నీ వాలింపవే మారుతీ. 45

45. మనోహరమైన అకారముతో శింశుప అను చెట్టు కొమ్మ చాటున ఎవ్వరకు కనబడకుండ దాగియుంటివి. చెట్టుక్రింద రావణుడు సీతాదేవితో పలికిన చెడ్డ మాటలు, త్రిజట అను రాక్షసస్త్రీ కలలో చూచి చెప్పిన రావణుచావు శ్రీరామ జయము వింటివి. అకష్టములను భరించుచు సీతాదేవి చేసిన విలాపము నంతయు శ్రద్ధగా వింటివి, చూచితివి, కదా మారుతీ!

శా. రామాధీశుడు తండ్రి పంపున మహారణ్యోర్వికిన్ వచ్చి ని
ష్కామం దత్పతి సీత బల్మిc గొని వీకం బోయె బంక్త్యాస్యుc డా
రామన్ వే వెదకంగ నేను జలధిన్ లంఘించి శోధించి యి
చ్చో మన్మాతను గంటి మంటి ననుచున్ శ్రోత్రానుకూలంబుగా
వేమాఱున్ మధురంబుగాc బలుకవే విన్నాణివై మారుతీ. 46

46. 'తండ్రి దశరథుని మాటను గౌరవించి, రాముడు దండకారణ్యమునకు వచ్చెను ఏ కోరికలు లేని సీతాదేవిని రావణాసురుడు బలవంతముగా ఎత్తుకొని పోయెను. ఆ సీతాదేవిని వెదకుచు సముద్రము దాటి లంకాపట్టణము నంతను బాగుగ వెదకితిని. ఇక్కడ మాతల్లిని చూచి బ్రతికితిని' అని సమయమునకు తగినట్లు మధురముగ నేర్పరితన ముట్టిపడునట్లు గానము చేయునట్లు పలికితివి కదా మారుతీ!

మ. ఇది సంధింపంగ వేళ యంచుc గడcకన్ వృక్షంబు వేడిగ్గి య
మ్మదిరాక్షీమణి మ్రోల నిల్చి పతి సేమం బంతయుం జెప్పి త
ద్వదనాద్యాకృతి చిహ్నముల్ దెలిపి విశ్వాసంబు పుట్టించి దీ
ప్యదనర్ఘాంగుళిముద్రికం గుఱుతుగా నర్పింపవే మారుతీ. 47

47. సీతాదేవి కెదురుగా నిల్చి మాట్లాడుట కిది సరియైన సమయమని తలచితివి. శింశుప చెట్టుపై నుండి మెల్లగ దిగివచ్చితివి. సీతాదేవి ముందు నిలచితివి. శ్రీరామ లక్ష్మణుల క్షేమసమాచారము పూర్తిగా తెలిపితివి. శ్రీరాముని ఆకారము గుర్తులు, రూప, గుణ, ప్రమాణ విశేషములతో వర్ణించి చెప్పితివి. నీవు రామ ధూతవు అని సీతాదేవికి విశ్వాసము పుట్టించితివి. శ్రీరామ నామాంకితమైన రత్నాంగుళీయకమును గుర్తుగా సమర్పించితివి కదా మారుతీ!

మ. అతి సూక్ష్మాంగుcడ వీవు నన్నుc గొని యీయంభోనిధిం దాటి యే
గతి పోవం గల వంచు సీత పలుకం గౌతూహలం బొప్ప న
ప్రతిమానామరశైల సన్నిభ శరీరం బర్మిలిం జూపి యా
క్షితికన్యామణి కద్భుతంబు ముదముం గీల్కొల్పవే మారుతీ. 48

48. నీవు అతిసూక్ష్మమైన దేహము కలవాడవు. దాటి పోవలసినది అపారమైన సముద్రము. నన్ను మోసుకొని, సముద్రమంతా దాటి ఎట్లు పోగలవు ? అని సీతాదేవి తన సందేహమును తెలిపెను. అప్పుడు నీవు, నీ సూక్ష్మరూపమును,

సాటిలేని మేరుపర్వత మంతదిగా, చేసి చూపితివి. అప్పుడు సీతాదేవి ఆశ్చర్యము, సంతోషము ఒకే సమయమున కనబరచెను కదా మారుతీ!

మ. ప్రమదం బొప్పఁగ సీత యిచ్చిన శిరోరత్నం బొగిన్ సంగ్రహిం
చి మహత్ముం డగు రాము నిచ్చటికి నే శీఘ్రంబునఁ దోడి తె
త్తు మదిన్ శోకముఁ దక్కియుండు మని యెంతో భక్తితో నూరడిం
చి, మహిన్ సాగిలి మ్రొక్కి గైకొనవె యాశీర్వాదముల్ మారుతీ. 49

49. సీతాదేవి సంతోషముతో యిచ్చిన శిరోరత్నమును తీసుకొంటివి. దానిని తీసుకొని 'మహాత్ముడగు శ్రీరామచంద్రమూర్తిని వెంటనే యిక్కడకు తీసికొని వచ్చెదను. దుఃఖము విడువుము, అని భక్తి, వినయములతో ఓదార్చితివి. అంతేకాక సీతాదేవికి సాష్టాంగనమస్కారము చేసి దీవెనలను పొందితివి కదా మారుతీ!

మ. జనకక్ష్మాపతిపుత్రిచేఁ దగ ననుజ్ఞాతుండవై 'యూరకే
జన నేలా, దశకంఠదైత్యునకు మత్సామర్థ్య మొక్కింత జూ
ప నగుం గా' కని తండ్రివోలె నతిరంహం బర్మిలిం దాల్చి గ్ర
ద్దన నద్దైత్యుని ప్రాణతుల్యవన ముత్పాటింపవే మారుతీ. 50

50. ఊరక సీతాదేవి సందేశమును తీసికొని వెళ్ళుటవలన ప్రయోజనమేమి? రావణునకు నాసామర్థ్యము కొంత తెలియజేసి, రావణుని బలము, దుర్గబలము తెలిసికొని పోవలెను, అని అనుకొంటివి. ఆ విషయసేకరణకై వాయుదేవునివలె వేగబలమునుచూపి రావణుని ప్రాణతుల్యమైన అశోకవనములోని చెట్లనన్నింటిని పీకివేయ గడంగితివి కదా మారుతీ!

మ. అనురాధీశ్వరుఁ డవ్విధంబు విని కట్టల్కన్ రణార్థం బశీ
తిసహస్రంబులఁ గింకరాఖ్యుల మహాతేజః ప్రభావాఢ్యులన్
వెనఁబంపన్ విలయాంబుదంబు కరణిన్ మిన్నంది గర్జించి దీ
మస మొప్పం దగ వారినెల్లఁ గడిమిన్ మర్దింపవే మారుతీ. 51

51. నీవు చేసిన వనభంగమును రావణుడు విని, మండిపడి, ఎనుబదివేల మంది మహాబలవంతులగు కింకరులను పంపెను. నీవు వారిని చూసి, ప్రళయకాలపు మేఘమువలె గర్జన చేసితివి. ఆ రాక్షసులకు భయము పుట్టున ట్లాకాశము తాకునంతగా పెరిగి, ధైర్యసాహస పరాక్రమములతో విజృంభించి, వారినందరను చంపితివి కదా మారుతీ!

శా. వజ్రపంబుల్ బడఁగూల్చి బల్విడి నభోభాగంబుతో రాయు చై
త్యప్రాసాదముఁ గూలఁ దన్ని విపులస్తంభంబుచే బాహుస
త్త్వప్రావీణ్య మెలర్పఁ దద్వనముఁ దత్ప్రాసాదముం గాచు దే
వప్రద్వేషుల నెల్ల దారుణగతిన్ భంజింపవే మారుతీ. 52

52. గోడలుపడగొట్టి, ఆకాశమునంటియున్న చైత్య పాసాదమును కూలదన్నితివి. పెద్దస్తంభమును చేతపట్టుకొని, నీ భుజబలకుశలత చేత ఆ వనమును, వనములోని చైత్యప్రాసాదమును రక్షించు రాక్షసుల నందరను, దారుణగతి చంపితివి కదా మారుతీ!

శా. శైలోత్పాటన దక్షిణుం డగు నభస్వత్పుత్రుఁడన్ జన్యవి
ద్యాలోలుండగు రామభద్రునకు నే దాసుండ సుగ్రీవునిన్
వాలాయంబు భజించువాఁడ హనుమన్నామంబునం బొల్తు భూ
పాలుం డంపఁగ భూమిపుత్రిఁ బరికింపన్ వచ్చితిన్ గ్రవ్యభు
క్కాలుండన్ జనుతెండు పోరి కని లంకం జాటవే మారుతీ. 53

53. 'కొండలను పెళ్ళగించు నేర్పుగల వాయుదేవుని కుమారుడను. యుద్ధవిద్యలో ఆరితేరిన శ్రీరామచంద్రునకు దాసుడను. ఎల్లప్పుడు సుగ్రీవుని కాచియుండు వాడను. హనుమంతు డనుపేరున పిలువబడువాడను. శ్రీరాముడు పంపగా సీతాదేవిని వెదుకవచ్చితిని. మాంసము తిను రాక్షసుల పాలిటి యముడను. యుద్ధమునకు రండు' అని లంక మార్మోగునట్లు చాటితివి కదా మారుతీ!

మ. కడఁకన్ రావణప్రేరితుం డగుచు వీఁకన్ జంబుమాల్యాఖ్యదై
త్యుఁడు సేనాయుతుఁడై రణంబునకుఁ దోడ్తో డాసినన్ వానిఁ బ
ల్విడి భాస్వత్పరిఘాయుధంబున బలోపేతంబుగా నాజిలో
గడిమిం జంపి యుగాంతమేఘముక్రియన్ గర్జింపవే మారుతీ. 54

54. రావణప్రేరితుడై జంబుమాలి అను పేరుగల రాక్షసుడు సైన్యముతో కూడ వచ్చెను. వెంటనే అతనిని, అతని సైన్యమును పరిఘ అను ఆయుధముతో చంపి ప్రళయకాల మేఘమువలె గర్జించితివి కదా మారుతీ!

మ. వరుసన్ దారుణ సప్త మంత్రితనయుల్ బాహాబలం బొప్ప బం
దుర వైశ్వానర సప్తహేతులన దోర్త్రో వెల్గుచున్ డాసినన్
కరులం గన్న మృగేంద్రులీల పెనుకిన్కం బొంగి యద్దైత్యుల
స్థిరసత్వంబున ద్రుంపవే కలన నిశ్శేషంబుగా మారుతీ. 55

55. దారుణముగా యుద్ధము చేయగలరని ప్రసిద్ధి కెక్కినవారు ఏడుగురుమంత్రి కుమారులు. వారు తమ బలనేర్పును ప్రదర్శిస్తూ, వైశ్వానరుడు (విశ్వమును దహింపగలవాడు) అనిపేరు కలిగిన అగ్నిదేవుని మండిపడు ఏడుజ్వాలలా అనునట్లు, నిన్ను సమీపించిరి. నీవు వెంటనే, ఏనుగులను చూచి ఉప్పొంగు సింహమువలె, పెద్దకోపముతో విజృంభించితివి. నీ నిలకడ కలిగిన బలముచే, ఆ ఏడుగురు మంత్రికుమారులలో నొకరైన మిగులకుండ, యుద్ధముచేసి చంపితివి కదా మారుతీ!

మ. దురితాత్ముల్ దశకంఠుపంపున మదాంధుల్ పంచసేనాగ్రగుల్
పరుషోగ్రాస్త్రము వేయుచుం గదియఁ గాలం గేల మర్దించి భీ
కరభంగిన్ పరిమార్చి తోరణ విటంకస్థుండవై, వెండి దు
ష్కరదైతేయ సమాగమంబు మదిలోఁ గాంక్షింపవే మారుతీ. 56

56. విరూపాక్షుడు, యుపాక్షుడు దుర్ధరుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అని పేరుక లిగిన పాపాత్ములు, బలమదముచే కన్నుగానని వారు. అట్టి ఐదుగురు సేనా నాయకులను, రావణుడు నీ మీదికి పంపెను. వారు తీక్షణముగ బాధించు భయంకరాస్త్రములను వేయుచు, నిన్ను సమీపించిరి. నీవు వారిని కాళ్ళతో, చేతులతో, పొడి చేసి భీకరముగా చంపితివి. మళ్ళీ ఏమి తెలియని అమాయకుని వలె, తోరణ స్తంభమెక్కి, రాక్షసుల రాక కెదురుచూచుచు కూర్చొంటివి కదా మారుతీ!

శా. అక్షీణస్ఫుట బాహుశౌర్యుఁడు మహాహంకారుఁడున్ దైత్యహ
ర్యక్షుం డక్షుఁడు డాయఁ దార్క్ష్యుఁ డహిన ట్లవ్వాని పాదంబులన్
దక్షత్వంబునఁ బట్టి యెత్తి వడి మింటన్ బల్మరుం ద్రిప్పి జ
న్యక్షోణిం బడవైచి చంపవె బలౌద్ధత్యంబునన్ మారుతీ. 57

57. మహా అహంకారుడు, సింహపరాక్రముడు అయిన అక్షుడను పేరుగల రావణుని కుమారుడు, నిన్ను సమీపించెను. నీవు పాములను కాళ్ళతో తన్నికొని పోవు

గరుత్మంతుని వలె, అక్షుని కాళ్ళు పట్టి పలుమా ర్లాకాశమున త్రిప్పి బలముగ యుద్ధభూమిని విసరివేసి చంపితివి కదా మారుతీ!

మ. జనితామర్షణుఁ డింద్రజిత్తు సకలాస్త్రజ్ఞుండు బ్రహ్మాస్త్రబ
ద్ధునిఁ గావింప వరప్రభావమునఁ దోడ్తో బంధముక్తుండవై
దనుజేంద్రుం గని వానితో విభుని దోర్దర్పంబు సర్వంబు దె
ల్పనగుం గాకని బద్ధు డైనపగిదిన్ వర్తింపవే మారుతీ. 58

58. అస్త్రముల నన్నిటిని తెలిసి ఇంద్రుని జయించిన ఇంద్రజిత్ అను రావణుని కుమారుడు, కోపోద్రేకముతో రెచ్చి వచ్చి నిన్ను బ్రహ్మాస్త్రబద్ధుని చేసెను. నీవు బాల్యమున పొందిన వరము చేత, బంధమునుండి విముక్తుడ వైతివి. కానీ రావణుని చూచుటకు, రావణునకు శ్రీరాముని బలపరాక్రమ మంతయు తెలుపుటకు అస్త్రబద్ధుడైన వాని వలె నటించితివికదా మారుతీ!

మ. దితిజాధీశుని మ్రోల నిల్చి వెస దత్తేజంబు రూపంబు సం
స్థితి సర్వంబును బోలఁ జూచి యహహా తేజస్వి యౌ వీని యం
దతి దౌష్ట్యం బిది లేక యున్న సురలోకాధీశ్వరత్వంబు స
మ్మతి నొందం దగ నర్హుఁడంచు మదిలో భావింపవే మారుతీ. 59

59. సకల రాక్షసపరివారముతో ఇంద్రజిత్తు, నిన్ను రావణుని ముందుకు తీసికొని వెళ్ళెను. నీవు రావణుని తేజస్సు ఆకారము, అన్నిరకముల ఠీవి చూచి "ఆహా! ఇంత తేజోసంపన్నుడైన వీనియందు ఈ దుర్మార్గము లేకుండిన దేవేంద్రపదవి కర్హుడగు కదా!" అని మనస్సులో మెచ్చుకొంటివి కదా మారుతీ!

మ. భవదీయాకృతియున్ బ్రతాపమును శుంభద్వీర్యముం గాంచి దై
త్యవిభుం డీతఁడు కీశమాత్రకుడుఁగాఁ డాదిత్యులుం బంపఁగా
భువిఁగీశాకృతిఁదాల్చి వచ్చిన మహాభూతం బగుం గానిచో
దివిజారాతులఁ జంపునే యనుచుఁ జింతింపండొకో మారుతీ. 60

60. నీ ఆకారము, తేజస్సు బలపరాక్రమములు చూచి రావణుడు "ఇతడు వానర మాత్రుడు కాడు. దేవతలు పంపగా వానర రూపము ధరించి భూమిపై కొచ్చిన పెద్దభూతమేమో! కానిచో, దేవవిరోధులైన రాక్షసులను చంపునా?" అని చింతించెను కదా మారుతీ!

శా. 'ఓరి రావణ! నేను రామనృపవంశోత్తంసుదాసుండ నా
శూరాగ్రేసరుపత్ని నీవు వనిలో జోరుండవై తెచ్చి త
న్నారీరత్నము నిమ్ము రాఘవునకున్ గాకున్న నీ వింక త
ద్ఘోరాస్త్రంబులఁ జత్తు వాజి' నని నీతుల్ దెల్పవే మారుతీ. 61

61. "ఓరే రావణా! ప్రజలను ధర్మముగ పాలించు రాజవంశమునకు చెందిన, శ్రీరామునకు దాసుడను. ఆవీరశ్రేష్ఠుని ధర్మపత్ని సీతాదేవిని, అడవిలో దొంగతనముగ తెచ్చితివి. ఆ సీతాదేవి మామూలు స్త్రీ కాదు సర్వస్త్రీలలో రత్నము వంటిది. కావున శ్రీరాముని ఘోరఅస్త్రముల ప్రభావమున నీవు చత్తువు" అని నీతిమాటలు చెప్పితివి కదా మారుతీ!

శా. "బాలారత్నము సీత ముచ్చి లిటు నీ పాలింటికిన్ మృత్యు వం
చాలోచింపక దెచ్చి తింత కెపుడో యద్దేవి కోపానల
జ్వాలాళిం బడి భస్మమై చనక సప్రాణుండవై యుండుటల్
చాలన్ చిత్రము భర్తచే ఁగలన నిన్ జంపింప నిందాక ని
ట్లాలస్యం బొనరించె నం చనవె దేవారాతితో మారుతీ.

62. "ఎప్పుడు పదునారేండ్లప్రాయమున కనుపట్టుస్త్రీ బాలారత్నము. అట్టిబాలలలో శ్రేష్ఠమైనది సీతాదేవి. అట్టి సీతాదేవిని దొంగతనముగ తెచ్చుట నీపాలిటి మృత్యువును కొనితెచ్చుకొనుట" అని ఆలోచించి తెలిసికొనలేక తెచ్చితివి. ఆమె కోపాగ్నిలో పడి, యింతకుముందే భస్మమై యుండవలసినది. అట్లు చావక, నీవు ప్రాణముతో యుండుట మిగుల ఆశ్చర్యము. బహుశః తన భర్త శ్రీరామచంద్రునిచే యుద్ధమున చంపింపవలెనని, ఆలస్యము చేయుచున్నట్లున్నది' అని చెప్పితివి కదా మారుతీ!

మ. "ఖల దైత్యాధమ! జానకీసతిని నీ కంఠస్థశాతాసిగాఁ
దలపై బడ్డ మహాశనిచ్ఛదముగాఁ దాలుస్థితోద్యద్ధలా
హలముంగా వసనాంచలగ్రథిత దీప్తాగ్నిస్ఫులింగంబుగా
తలప న్నేరక దెచ్చి తీ వని రహిన్ దర్శింపవే మారుతీ. 63

63. "నీచ! రాక్షసాధమ! సీతాదేవిని నీ గొంతుమీది పదునైన కత్తిగా, నీ నెత్తిమీద విరుచుకపడిన పిడుగుగా, నీ దవడలో వ్యాపించుచున్న హాలహాల విషముగా,

నీ వస్త్రపు అంచున అంటుకొని వ్యాపించుచున్న అగ్నికణముగా తెలిసికొన లేక తెచ్చితెవి." అని నీవు బెదరింపలేదా మారుతీ!

మ. తరమే నీకిక నెందుఁబోఁగలవు పాతాళంబులో డాఁగినన్
శరధిం జొచ్చిన మిన్నుఁ బ్రాకిన దశాస్యా! వజ్ర వజ్రాభ భీ
కరబాణంబుల నీశిరంబు లనిలో ఖండించి యా కాకుత్స్థుఁ డా
వరవర్ణిన్ గొనిపోవు నిక్క మనుచున్ వాదింపవే మారుతీ. 64

64. "ఇంక తప్పించుకొని పోవుట నీతరమా? ఎక్కడికి పోగలవు? శ్రీరామచంద్రునికి భయపడి పాతాళలోకమున దాగినను, సముద్రములో ప్రవేశించి దాగినను (చొచ్చినను), ఆకాశమున కెగరి ఎచ్చటైన దాగినను (అనగా ముల్లోకములలో ఎక్కడ దాగినను) శ్రీ రాముని బాణములనుండి తప్పించు కొనలేవు. శ్రీరాముడు నీ శిరస్సును వజ్రాయుధము వంటి భయంకరబాణములతో ఖండించి, సీతా దేవిని తప్పక తీసికొని పోవును. ఇది జరుగబోవు నిజము. తెలుసుకో" అని శాంతియుతపరిష్కారమునకై వాదింపవే మారుతీ!

మ. దశకంఠాసుర పుణ్యసాధ్వియగు సీతం గానలో దొంగవై
పశుబుద్ధిం గొనితెచ్చి నందు కిపుడే బంధించి ముష్టిన్ త్వదు
గ్రశిరంబుల్ వెస వ్రక్కలింప నగు నారామాజ్ఞ లే కున్కి దు
ర్దశ నొందింపక యోర్చి యుంటి ననుచుం దర్జింపవే మారుతీ. 65

65. "రావణా! పుణ్యసాధ్వియైన సీతాదేవిని, ఆలోచింపక పశుబుద్ధితో దొంగతనము చేసి తెచ్చితివి. కనుక నిన్ను బంధించి, నీ మండిపడే (ఉగ్ర) తలలను నాపిడికిట పగులగొట్ట గలను కాని శ్రీరాము డామాట చెప్పనందున, నీ కా దుర్దశ పట్టింపక ఊరకుంటిని" అని రావణుని బెదరించితివి కదా మారుతీ!

మ. దనుజాధీశుఁడు నీదువాలమునకున్ తైలార్ద్రచేలంబు లా
య్యనఁ జుట్టించి కొనన్ కృశాను నిడి దేవారాతు లివ్వానరుం
గొని ప్రోలంతయుఁ ద్రిప్పు డంచుఁ బలుకన్ ఘోషింపుచున్ దైత్యుల
ట్లొనరింపన్ బురి గుప్తికర్మము తదుద్యోగంబు వీక్షింపఁ బె
ల్చన దత్కర్మ మొకింత సేపు మదిలో సైరింపవే మారుతీ. 66

66. రావణుడు గుడ్డలు నూనెలో తడిపించి, నీతోకకు చుట్టించెను. దానికొనకు నిప్పుపెట్టించి "ఈ వానరుని పట్టణ మంతా త్రిప్పుడు" అనిరాక్షసులతో చెప్పెను. రాక్షసులు ఘోషచేయుచు అట్లు తీసికొని పోయిరి. లంకాపురరక్షణరహస్యములు చూచు అవకాశము కలిగినందుకు, కొంతసేపు వారు చేసిన దుష్కార్యములను మనస్సున ఓర్చుకొంటివి, కదా మారుతీ!

మ. ప్రకటింపన్ జగముల్ దహించు శిఖి నీ వాలాగ్రగుండయ్యు జా
నికి యాశీర్వచనంబునన్ బవన బాంధవ్యంబునన్ జేసి తా
వకవాలాంచితరోమమైనఁ గమలింపన్ శక్తుఁడుంగాక పొం
దికతోఁ జందనపంకశీతుఁ డగుచున్ దీపింపఁడే మారుతీ. 67

67. ప్రపంచముల నన్నింటిని కాల్చివేయగల అగ్నిదేవుడు, నీతోక చివరన వెలుగుచుండెను. సీతాదేవి ఆశీర్వాదబలము వలనను, అగ్నిదేవునికి సహాయము చేయు వాయుదేవుడు నీతండ్రి అగుటవలనను, చందనగంధపు పూతవలె చల్లగా నుండి, అగ్నిదేవుడు నీ తోక వెంట్రుకనైనను కాలిన గుర్తుగా చేయలేక ప్రకాశించుచుండెను కదా మారుతీ!

మ. తనువుం గొంచెముఁ జేసి రజ్జుమయ బంధంబుల్ వడిం ద్రుంచి వెం
టనె కాలాభ్రము వైఖరిన్ బెరిగి తోడన్ వచ్చు దోషాటులన్
మునుముట్టం దునుమాడి నిర్జరులు సంతోషింప వాలాగ్నిచే
ఘనలంకానగరంబు సర్వ మవిశంకం గాల్చవే మారుతీ. 68

68. దేహము సూక్ష్మముచేసి త్రాళ్లతో కట్టిన ముడులు వదులై ఊడిపోవునట్లు చేసితివి. వెంటనే ప్రళయకాలములో వృద్ధి పొందిన మేఘమువలె దేహము పెద్దదిగ చేసితివి. నీ వెంట వచ్చు రాక్షసులను ముందుగా చంపితివి. దేవతలందరు సంతోషించునట్లు లంకానగరము నంతను నీతోకన ఉన్న మంటతో ఏమాత్ర మనుమానములేక కాల్చితివి కదా మారుతీ!

మ. జనకక్ష్మాపతిపుత్రి యున్ననగరాజంబున్, నయజ్ఞుండు స
జ్జనమాన్యుం డగు నవ్విభీషణుని వేశ్మశ్రేష్ఠముం దక్క త
క్కిన లంకాపుర మెల్ల వాలకలితాగ్నిం గ్రాగి క్రుద్దేశనే
త్రనటత్పావక దగ్ధలోకసమతం బ్రాపించెఁగా మారుతీ. 69

69. సీతాదేవి కాశ్రయ మిచ్చు శింశుపవృక్షము, నీతిమంతుడు మంచివారిచే గౌర వింపబడువాడైన విభీషణుని ఇల్లు తప్ప, తక్కిన లంకాపురమంతయు, నీ తోకమంటతో, కాల్చితివి. అప్పు డాలంకాపురము, పూర్వము కోపముతో శివుని మూడవకంట పుట్టి (అవలీలగా) నాట్యము చేయుచు వచ్చి, త్రిలోకములను దహించిన అగ్ని జ్వాలలతో సమానముగ, దహింపబడినది కదా మారుతీ!

మ. నిను బంధించుట నీదువాలమున వహ్నిం గొల్పుటల్ రాక్షసుల్
వినిపింపన్ విని సీత యేను పతికిం బ్రేమాస్పదీభూత నౌ
ట నిజం బేని కృపీటజన్మ! కడుపేర్కన్ మత్ప్రియార్థంబు పా
వనికిన్ శీతుండవై వెలుంగు మనుచుం బ్రార్థింపదే మారుతీ. 70

70. 'నిన్ను బంధించుట, నీతోకకు నిప్పంటించుట' రాక్షసులు సీతాదేవికి వినిపించిరి. అది వినిన సీతాదేవి "చల్లని పవిత్రమైన నీటపుట్టిన అగ్నిదేవా! నేను శ్రీరామచంద్రుని ప్రేమకు పాత్రురాలి నయితే. హనుమంతుని బాధింపక చల్లని సుఖస్పర్శనిచ్చి, నన్ను సంతోషపెట్టుము" అని ప్రార్థన చేసినది కదా మారుతీ!

మ. ఘనవాలాగ్ని శిఖాళిఁ గాల్చితిని లంకన్ సీత యేమయ్యెనో
యని శంకించి కృశానుచేఁ గమల కాహా! నేండు వైదేహనం
దిని సేమంబున నున్న దంచు వినువీథి న్మ్రోయు దేవోక్తులన్
విని మోదంబున భూమిపుత్రి నరలన్ వీక్షింపవే మారుతీ. 71

71. "నా తోక కంటించిన నిప్పుచేత లంకాపురము నంతటినీ కాల్చితిని. కాల్చున ప్పుడు, సీత ఏమగు నని ఆలోచింపలేదు" అని నీవు బాధపడుచుండగా "అహా! ఎంత వింత! లంకంతా కాలినా సీతక్షేమం" అన్న దేవతల మాటలు ఆకాశవీథిన విని, సీతాదేవిని చూచితివి కదా మారుతీ!

మ. శరధిం దాటి దశాస్యుప్రో లమరు లెంచం జొచ్చి సర్వంసహా
వరజం గాంచి, యశోకకాననము విధ్వంసంబు గావించి కొం
దఱ దైతేయులఁ జంపి మెండి జలధిన్ లంఘించి శీఘ్రంబె యు
త్తరతీరస్థ నగంబుఁ జేరితివి గాదే బల్విడిన్ మారుతీ. 72

72. సముద్రమును దాటితివి. లంకను దేవతలు మెచ్చు విధముగా ప్రవేశించితివి. సీతాదేవిని చూచితివి. అశోకవనము పాడు చేసితివి. కొందరు రాక్షసులను చంపితివి. తిరిగి సముద్రమును దాటి, ఉత్తరతీరమున నున్న కొండను చేరితివి కదా మారుతీ!

మ. కనుగొంటిన్ రఘురామపత్ని నల లంకాపట్టణాభ్యంతరం
బున నంచుం దగఁ బోయివచ్చిన విధంబున్, సర్వకార్యంబులున్
వినయం బొప్పఁగఁ దెల్పి యంగదునకున్ నీలాజపుత్రాది కీ
శనికాయంబుల కట్టొసంగవె మహాసమ్మోదమున్ మారుతీ. 73

73. 'కనుగొంటి సీతను లంకలో' అని అంగదాదులకు టూకీగా చెప్పితివి. తరువాత పోయి వచ్చిన విధము, చూచిన విషయములు, సర్వవివరములు వినయముతో తెలిపి అంగద, నీల, జాంబవదాదులకు మహదానందము కలిగించితివి కదా మారుతీ!

మ. చిరకాలంబున నుండి పెంచిన మధుస్ఫీతోరుకాంతారముం
గర మర్థిన్ వడిఁ జొచ్చి విచ్చలవిడిన్ సంతుష్టియౌ నట్లుగా
వరుసన్ దేనెలు ద్రావ నిచ్చి ఫలముల్ భక్షింపఁగాఁ జేసి వా
నరులం దృప్తులఁ జేయవే సమధికానందంబుతో మారుతీ. 74

74. చాలకాలమునుండి తేనె చేర్చి పేర్చబడిన తేనతెట్టు లనేకములు మధువనములో నుండినవి. ఆమధువనములోనికి నీతో వచ్చిన వానరు లందరను వెళ్ళనిచ్చి, వారికి కావలసిన పండ్లను తిన నిచ్చితివి. కావలసిన తేనె త్రాగ నిచ్చితివి. అట్లు వారినందరను ఆనందముతో తృప్తిపరచితివి కదా మారుతీ!

శా. ఆరామాధిపు పాదపద్మముల కుద్యద్భక్తితో మ్రొక్కి గ
న్నారన్ జూచితి భూమిపుత్రిని దశాస్యావాసమౌ లంకలో
సారోద్యానమునందు దైత్యయువతీ సందోహమధ్యంబునన్
వీరగ్రామణి! చిక్కియున్నదని తద్వృత్తాంత మాద్యంత మిం
పారం దెల్పి, ముదబ్ధిఁ దేల్పవె నృపాలాగ్రేసరున్ మారుతీ. 75

75. శ్రీరామచంద్రుని పాదపద్మములకు భక్తితో నమస్కరించి "చూచితి కండ్లార సీతను, రావణవాసమౌ లంకలో అశోకవనమున రాక్షసస్త్రీల మధ్య సీత చిక్కియున్నది" అని ముక్తసరిగ ముందు చెప్పితివి. తదుపరి వృత్తాంతము నంతయు, మొదటినుండి చివరివరకు మధురముగా తెలిపి, శ్రీరాముని మనస్సు సంతోషసముద్రతరంగముల మీద తేలియాడు నట్లు చేసితివి కదా మారుతీ!

మ. మహిపుత్రీకుశలంబు దెల్పి, మము సమ్యగ్ప్రీతిపాథోధి వా
ర్లహరిన్ దేల్చితి. వింక నేను ప్రతికారం బేమి గావింతు? మ
త్స్వహోనోద్రగభుజాయుగాంచితపరిష్వంగంబు నీ కిచ్చెదన్
రహి మీఱ న్గొను మం చొసంగఁడె కృపన్ రాజేంద్రుఁడున్ మారుతీ. 76

76. "సీతాకుశలము తెలిపి, మమ్ము మహదానంద సాగరతరంగ తరగలపై తేలియాడ చేసితివి. దీనికి సరియగు ప్రత్యుపకారము నే నేమి చేయగలను?"అని పలికి, తనది అని చెప్పగలిగిన లోక రక్షాకరములు (లోకరక్షణకు నివాసస్థానమైనవి) ఆశ్రితజన శ్రీకరములు (ఆశ్రయించిన జనులకు శోభనిచ్చునవి) మునిజనవశీకరణములు (సాధుజనులకు లొంగునవి) రిపులోకభీకరములు (శత్రులోకమునకు భయంకరమగునవి) అయిన పొడవైన రెండు చేతులు చాచి మనసార గాఢముగ స్నేహార్ద్రత, కృతజ్ఞతాపూర్వకముగ నిన్ను హత్తుకొనెను కదా మారుతీ! (మనిషికి పంచభూతాత్మకమైన దేహమే తన అస్తి అని ధ్వని)

శా. ఆలంకాపురి గుప్తికర్మము. నిశాటాళిప్రలాపంబులున్
వాలాయంబు దశాస్యగర్వమును సర్వంబున్ నివేదించి కీ
శాళిం దొడ్కొని ఘోరజన్యమునకున్ యానంబు గావింపు; మిం
కాలస్యం బది యేల టంచు విభునిం బ్రార్థింపవే మారుతీ. 77

77. ఆలంకాపురి నిర్మాణరహస్యములు, రాక్షస ప్రలాపములు, రావణగర్వము, సర్వము రామునకు నివేదించితివి. వానరసమూహముతో ఘోరయుద్ధమునకు ప్రయాణము చేయమని త్వరచేసి ప్రార్థించినది నీవే కదా మారుతీ!

మ. మతిమంతుండు విభీషణుండు, రఘురామా, నన్ను రక్షింపు మం
చతిదైన్యంబున నేగుదెంచిన దదీయాకార వాగింగితా
తత శీలంబుల చేత వాని పరిశుద్ధత్వంబు బోధించి, స
మ్మతి నిప్పింపవె వాని క ట్లభయమున్ క్ష్మానాథుచే మారుతీ. 78

78. బుద్ధిమంతుడైన విభీషణుడు "రఘురామా నన్ను రక్షింపుము" అని అతి దీనముగా శరణు వేడెను. అతనిరూపము, మాటల పొందిక, మనసులోపలి అభిప్రాయము, నడవడి చేత విభీషణుని పవిత్రత, నిర్మలత్వము శ్రీరామునకు నచ్చునట్లు చెప్పితివి. శ్రీరామునిచేత, విభీషణుని కభయము నిప్పించినది నీవే కదా మారుతీ!

మ. నలు ఁడా సేతువు గట్టు నప్పుడు కపుల్ నానా ప్రకారంబులన్
శిలలం జెట్టులు, దెచ్చి వైచు నెడ నిస్సీమప్రభావంబునన్
జల మారం దగ నీవు రాఘవుఁడు మెచ్చం గొప్ప శైలంబులన్
బలు పొప్పం గొని తెచ్చి, వైచి, జలధిం బంధింపవే మారుతీ. 79

79. సముద్రుని మాట ప్రకారము నలుడు సముద్రమునకు సేతువు కట్టుచుండెను. అప్పుడు వానరులు తమ శక్తి కొలది రకరకములైన రాళ్ళు కొండలు, చెట్లు తెచ్చి వేయుచుండిరి. నీవు నీ శక్తికి తగినట్టుగా పెద్దపెద్ద కొండలను పెకలించుకొని వచ్చి శ్రీరాముడు మెచ్చునట్లుగా సముద్రమునందు వేసితివి అట్లు అనేకములు వేసి సముద్రమును బంధించితివి. కదా మారుతీ!

మ. కనకోర్వీధరరాజ మద్భుతగతిం గాలాభ్రముం దాల్చిన
ట్లనుమానింపఁగ నీవు భూరివిపులోద్యత్పృష్ఠభాగంబునన్
దిననాథాన్వయసోము రాము నమితస్థేమున్ రహిం దాల్చి, గ్ర
న్ననఁ దత్సేతుపథంబునం జలనిధిం దాటింపవే మారుతీ. 80

80. నీ శరీరము బంగారుకొండ వంటిది. సూర్యవంశమున ఆహ్లాదకరమైన చంద్రుని వంటివాడు శ్రీరాముడు. అట్టిశ్రీరాముని శరీరము కాలమేఘమువంటి నీల శ్యామల వర్ణము- నీ వీపుమీద శ్రీరాముని ఎక్కించుకొని సేతువు మీద సముద్రమును దాటు నపుడు బంగారుకొండ (హనుమంతుని వర్ణము) కాలమేఘమును (శ్రీరాముని వర్ణమును) ధరించినదా యను సందేహము కలుగు చుండెను. అట్టి సంశయ ముండునట్లు శ్రీరాముని సముద్రము దాటించితివి కదా మారుతీ!

మ. సురనాథుండు శతారధార నలుకన్ క్షోణీధ్రముం బోలె సం
గరభూమిస్థలి ధూమ్రలోచన మహాక్రవ్యాదునిం బట్టి ని
ష్ఠురశైలప్రహతిన్ విభిన్నపృథుశీర్షుం జేసి, దుర్దాంత భీ
కరభంగిన్ బడఁగూల్చవే, నృపతి వేడ్కం జూడఁగా మారుతీ. 81

81. పూర్వము ఇంద్రుడు వజ్రాయుధముతో రెక్కలు గలకొండల రెక్కలు నరికి, రెక్కలను, పర్వతమును వేరు చేసెను. అదేవిధముగా నీవు ధూమ్రాక్షుడు అను రాక్షసుని తలపై పెద్దకొండ విసరివేసి, తలను, మొండెమును వేరు వేరు చేసితివి. అట్లు ధూమ్రాక్షునితో యుద్ధము చేసిన నిన్ను చూచి, శ్రీరాముడు మెచ్చు కొనెను. కదా మారుతీ!

మ. ఘనబాహాబలుఁ డయ్యకంపనుఁడు దైత్యానీక సంయుక్తుఁడై
యనికిం డాసిన భూరిరౌద్రరసదీప్తాస్యుండవై ఘోరవృ
క్షనిపాతంబున వాని పెన్నురము వ్రక్కల్ చేసి వాతూల మొ
య్యన వృక్షంబును బోలె గూల్పవె సురల్ హర్షింపఁగా మారుతీ. 82

82. గొప్పబలవంతుడైన అకంపనుడు రాక్షససైన్యముతో యుద్ధమునకు వచ్చెను. రౌద్రరసమే అకారము దాల్చినదా యనునట్లు, ఎఱ్ఱని ముఖము కలవాడవై సుడిగాలి పెద్దచెట్టును వేళ్ళతోసహా పెకలించునట్లు, ఒక్క దెబ్బతో అకంపనుని రొమ్మును పగుల గొట్టి క్రింది పడవేసితివి. అదిచూచి దేవతలు సంతోషించిరి కదా మారుతీ!

మ వదనంబుం బ్రళయార్కబింబము క్రియన్ భాసిల్ల, లాంగూల మా
త్రిదశేంద్రాయుధ వైఖరిన్ మిగుల నుద్దీపింప బంచాననో
ద్యదహీంద్రంబును బోని దక్షిణకరం బాసక్తితో నెత్తి, వా
రిదనాదంబున ధాత్రి గ్రక్కదలఁ బేరెంబెత్తుచున్ వచ్చి త
ద్ద దశాస్యుండు సగంబుఁ జావ నఱచేతన్ వ్రేయవే మారుతీ. 83

83. నీముఖము ప్రళయకాల సూర్యబింబము వలె ప్రకాశించుచుండెను. నీతోక వజ్రాయుధమువలె మెరయుచుండెను. ఐదుతలల నాగుపాము పడగెత్తి నట్లు కనబడుచున్న నీ కుడిచేతి ఐదువేళ్ళు ఎత్తితివి. భూమి కంపించునంత వేగముగ పరుగెత్తి వచ్చితివి. మేఘగర్జన వంటి గర్జనతో పదిముఖములు కలిగిన రావణుని, సగముప్రాణము పోవునట్లు అరచేతితో దెబ్బ వేసితివి కదా మారుతీ! (పది ముఖములు, ఐదుతలలపామువంటి వ్రేళ్ళు, అరచేతిని గమనించిన పదిలో సగము (అర) ఐదు)

మ. రణరంగమ్మున మూర్ఛ నొందిన సుమిత్రాపుత్రునిం, ధీరునిన్
ఫణినాధాంశజు, లంక కట్లు గొనిపోవం జూచు దుష్టాత్ము రా
వణునిం వజ్రనికాశముష్టిహతి నొవ్వం జేసి తూలించి, ల
క్ష్మణునిం దేర్చి యొసంగవే విభునకున్ సంతోషివై మారుతీ. 84

84. యుద్ధభూమియందు మూర్ఛపోయిన అదిశేషావతారుడైన లక్ష్మణుని, లంకకు తీసుకొని పోవ రావణుడు ప్రయత్నించుచుండెను. అప్పుడు నీవు, వజ్రాయుధపు దెబ్బకు మూర్ఛపోవునట్లు నీ పిడికిటిపోటుతో రావణుని మూర్చిల్ల చేసితివి. లక్ష్మణుని శ్రీరాముని చెంత చేర్చి, మూర్ఛనుండి తేర్చి, శ్రీరామునకు అప్పగించి, శ్రీరామునకు సంతోషము కలుగ చేసితివి కదా మారుతీ!

మ. హరిజిచ్చాపవిముక్త ఘోరతరబ్రహ్మాస్త్రప్రభావంబునన్
వరుసన్ మూర్ఛిలి చాపకట్టుగ రహిన్ సంగ్రామరంగమ్మునం
దరుదారం బడియున్న వానరుల నుద్యచ్ఛక్తి సంజీవిచే
కర మర్థిం బ్రతికించి మెప్పు గొనవే కాకుత్థ్సుచే మారుతీ. 85

85 ఇంద్రజిత్తు ప్రయోగించిన మహాభయంకరమైన బ్రహ్మాస్త్ర మహిమతో, వానరులు యుద్ధభూమిలో చాపకట్టుగ వరుసన మూర్ఛపడి యుండిరి. వారిని బ్రతికించుటకు, సంజీవ పర్వతమును తెచ్చి అందలి సంజీవిమూలికచే వానరుల నందరను బ్రతికించి, శ్రీరామునిచే మెచ్చుకొనబడితివి కదా మారుతీ!

శా. దైత్యానీకపయోధి మధ్యమున మందాద్రిభంగిన్ రయో
ద్ధత్యం బొప్పఁగ సంచరింపుచు బలౌదార్యం బెలర్పన్ బృహ
ద్వాత్యాచక్రము శుష్కపర్ణముల చందానన్ వడిం ద్రిప్పి, యా
దిత్యుల్ మెచ్చఁగ బట్టి గీ టడఁచవే దేవాంతకున్ మారుతీ. 86

86. మందర పర్వతమును కవ్వముగా చేసికొని, పూర్వము దేవతలు రాక్షసులు పాలసముద్రమును చిలికిరి. మందర పర్వతము పోలిన నీవు, రాక్షససముద్ర మధ్యమున వేగముగ తిరుగుచు, దేవాంతకు డనురాక్షసుని బలముతో పట్టి, సుడితో లాగి తిరుగు గాలి, ఎండుటాకును పట్టిలాగిత్రిప్పినట్లు, త్రిప్పిచంపి దేవతలచే మెప్పుబడసితివి కదా మారుతీ! (ఇందు దేవాంతకుని అకుగ హనుమంతుడు కవ్వము వలె తిరిగి సుడిగాలిని పుట్టింపచేసి దేవాంతకుని చంపునట్లు వర్ణనము)

శా. జంభారాతి నిజోరుపాణిగతభాస్వద్ఘోరదంభోళిచే
గాంభీర్యంబున విశ్వరూపుశిరముల్[1] ఖండించి నట్లీవు స
ర్వాంభోధుల్ గలగంగ నార్చుచు ఫణీంద్రాభాసి నంకించి. సం
రంభం బొప్ప వెసన్ త్రిశీర్షుశిరముల్ ఖండింపవే మారుతీ. 87

87. పూర్వము దేవేంద్రుడు తనబలమైన చేతితో వజ్రాయుధమును ధరించి, తనగురువైన విశ్వరూపుని మూడు తలలను[1] ఖండించెను. అదేవిధముగా నీవు సముద్రము లన్ని క్షోభించునట్లు అరచుచు, పామువలె కనుపించు త్రిశీర్షుడను రాక్షసుని మూడు తలలను ఖండించితివి కదా మారుతీ!

శా. మాయాసీతను జంపి నిన్ను భ్రమియింపం జేసి దుర్వారుడై
త్రేయప్రావృతుడై నికుంభిలకు నెంతేఁ గోర్కితో నేగి, య
చ్చో యాగం బొనరింపుచున్న యసురేశున్ మేఘనాధాఖ్యు దీ
క్షాయుక్తిన్ సమరోర్వి లక్ష్మణునిచేఁ జంపింపవే మారుతీ. 88

88. ఇంద్రజిత్తు మాయను ఆధారముగ చేసికొని, ఒక రాక్షసుని మాయసీతగ కల్పన చేసెను. దానిని తన రథమున నుంచుకొని, యుద్ధభూమిలో మాయాసీత తలను ఖండించి నీకు నిజసీతను చంపినట్లు భ్రమింపచేసెను. తరువాత నికుంభిల అను ప్రదేశమున దీక్షతో యజ్ఞము చేయుచుండెను. నీవు లక్ష్మణుని నికుంభిలకు తీసికొని వెళ్ళి, యజ్ఞభంగము చేసి ఇంద్రజిత్తును లక్ష్మణునిచే చంపించితివి కదా మారుతీ!

శా. విద్యుద్వల్లికభంగి వాలము వియద్వీథిం బ్రకాశింప ను
ష్ణద్యుత్యున్నతమండలంబు కరణిన్ వక్త్రంబు శోభిల్లగా
ప్రోద్యద్బాహుబలం బెలర్పఁగ నికుంభుం గుంభకర్ణాత్మజున్
సద్యోమృత్యువు నొందఁజేయవె మహాజన్యంబునన్ మారుతీ. 89

89. నీతోక మెఱుపుతీగవలె, ఆకాశములో ప్రకాశించుచుండెను. నీ ముఖము, ఎఱ్ఱని వృత్తాకారముతో సూర్యునివలె ప్రజ్వరిల్లు చుండెను. అట్టి రూపముతో కూడిన భుజబలముతో, కుంభకర్ణుని కుమారుడైన నికుంభుని, ఒక యేటునకు చచ్చు నట్లు దెబ్బ వేసితివి కదా మారుతీ!

1. విశ్వరూపునికి మూడు తలలు. ఒకదానితో దేవతలవలె అమృతము త్రాగుట, రెండవదానితో రాక్షసులవలె మద్యమును సేవించుట, మూడవదానితో మానవులవలె అన్నము తినుట అలవాటు. ఆ విశ్వరూపుని తండ్రి త్వష్ట ప్రజాపతి (దేవత). తల్లి రచన (రాక్షసి). కాబట్టి రాక్షసులపూజలు అందుకొనుచు దేవతలకు యిచ్చే యజ్ఞభాగములను రాక్షసులకు ఇచ్చేవాడు. ఇంద్రుడు విశ్వరూపుని ఏరికోరి గురువుగా తెచ్చుకొని పై పద్ధతిని సహింపక విశ్వరూపుని మూడుతలలను వజ్రాయుధముతో నరికెను. ఇది పూర్వగాథ.

మ. ఘనశాండిల్యమునీంద్రుశాపమున నుగ్రగ్రాహియై ధాన్యమా
లిని కాసారములోన నుండి జలముల్ నీ వర్థిఁగ్రోలన్ వడిన్
నిను మ్రింగం జనుదేరఁగాఁ గడిమి వానిన్ వ్రేల్మిడిం జంపి గ్ర
క్కున దచ్ఛాపము దీర్చి పుచ్చవొకొ శక్రుం గొల్వగా మారుతీ. 90

90. శాండిల్యమహాముని శాపమువలన, ధాన్యమాలిని అను పేరుగల అప్సరస భయంకరమైన మొసలిగా మారెను. ఆ మొసలి ఉన్న సరస్సులో, నీవు దప్పిక తీర్చుకొనుటకు దిగితివి. అచట మొసలి నిన్ను మ్రింగ రాగా, దానిని చంపి శాపవిమోచనము చేసి ఇంద్రుని సేవించుటకు ధాన్యమాలినిని పంపితివి కదా మారుతీ!

మ చతురత్వంబున నీవు లక్ష్మణునికై సంజీవిఁ దేఁ బోవుచో
దితిజాధీశ్వరు పంపునం బ్రబల దైతేయుండు మారీచుదై
త్యతనూజాతుఁడు కాలనేమి ఘనమాయామౌనియై త్రోవఁ జిం
తితవిఘ్నం బొనరింప డాయుటయు వానిం ద్రుంపవే మారుతీ. 91

91. లక్ష్మణస్వామిని మూర్ఛనుండి తేర్చుటకు, సంజీవిమూలిక అవసరమయ్యెను. దానిని తెచ్చుటకు నీవు పోవుచుంటివి. అది తెలిసిన రావణుడు, నిన్ను చంపుటకు మహా మాయాబల సంపన్నుడైన మారీచకుమారుడు కాలనేమిని నియమించెను. అతడు మాయాముని వేషముతో, నీకు విఘ్నము చేయ బూనెను. అకాలనేమిని చంపితివి కదా మారుతీ!

మ. తొలుతం బల్మరు మందు లిమ్మనుచు నెంతో వేఁడి, యీకున్న కే
వలశక్తిన్ హరి మందరాచలము నుత్పాటించిన ట్లీవు క
ట్టలుకన్ వాలముఁ జుట్టి పాదముల నిట్టట్టూచి దిగ్గాజిఘూ
ర్ణిల దివ్యౌషధశైలముం బెఱుకవే క్రీడాగతిన్ మారుతీ. 92

92. సంజీవిమూలికను గుర్తించలేక, ఆ మూలికలను కలిగిన పర్వతమును నీవతి భక్తితో మొదట ప్రార్థించితివి. అపర్వత మామూలిక నివ్వలేదు అప్పుడు నీవు నీశక్తినే ఆశ్రయించితివి. పూర్వము విష్ణుమూర్తి కూర్మావతారమున మందర పర్వతమును లేవనెత్తినట్లు, నీ తోకను సంజీవిపర్వతము చుట్టు చుట్టి పాదముల నిటునటు ఊపి, పర్వతము గిర్రున అన్నిదిక్కుల, తిరుగునట్లు చేసి దివ్యౌషధ శైలము నవలీలగ పెకలించి తెచ్చితివి కదా మారుతీ!

శా. గీర్వాణాద్రివిభాగమున్ శిరముపై గీల్కొల్ప దుర్దాంతదో
ర్గర్వం బొప్పంగ వచ్చుచుండ గిరికిం గావున్న పెక్కంద్రు గం
ధర్వుల్ బోవంగ నీక నడ్డపడినన్ దర్పంబునన్ వారలన్
దుర్వారోద్ధతి వాలజానిలమునం దూలింపవే మారుతీ. 93

93. చేతధరించిన సంజీవిపర్వతము, నీతలకు ముందుగా తలకంటే ఎత్తుగా ఉండునట్లు అకాశమార్గమున తెచ్చుచుంటివి. కొండకు కావలి ఉన్న గంధర్వులు, నిన్ను పోనివ్వక చుట్టు ముట్టి అట్టహాసము చేసిరి. వారట్లు పోనియ్యక అడ్డుపడగా, నీతోకను ఇటు, అటు వేగముగ త్రిప్పి పుట్టిన గాలి చేత వారిని చెల్లాచెదరు చేసి చంపితివి కదా మారుతీ!

మ. గరిమన్ మాల్యవదాది రాక్షసు లసంఖ్యాతంబుగా వచ్చి. యం
బరవీథిం జలరాశిమధ్యమున దర్పం బేర్పడం దాకినన్
గిరిరాజంబును కందుకంబు కరణిన్ గేలన్ రహిం దాల్చి దు
ర్భరవీర్యంబున వారిఁ జంపి జముఁ గొల్వం బంపవే మారుతీ. 94

94 నీవు సంజీవిపర్వతమును, బంతి నెత్తుకొను నంత అవలీలగా తెచ్చుచుంటివి. అప్పుడు మాల్యవంతుడు మొదలగు రాక్షసు లనేకులు,సముద్రమధ్యమున నెదిరించిరి. అప్పుడు నీవు, చేత పర్వతమును ధరించి కూడ ఆరాక్షసులను తిరుగులేని పరాక్రమముతో చంపి యమధర్మరాజును సేవించుటకు పంపితివి కదా మారుతీ!

మ. అవలీలన్ నిశిజాములోపల రయం బారంగ సంజీవిశై
లవరంబుం గొని తెచ్చి జన్యమునఁ బౌలస్త్యోల్లసచ్ఛక్తిచే
నవనిన్ మూర్ఛితుఁడైన లక్ష్మణున కీ వామందు లర్పించి, శూ
రవరేణ్యుం బ్రతికించి మెప్పుఁ గొనవే రాజేంద్రుచే మారుతీ. 95

95. రాత్రికాలము గడవక మునుపే శీఘ్రముగ వెళ్ళి, శ్రేష్ఠమైన సంజీవిపర్వతము నవలీలగా తెచ్చితివి. యుద్ధమున రావణశక్తిచే మూర్ఛపడియున్న లక్ష్మణునికి ఆమందు లర్పించితివి. దానితో మూర్ఛనుండి తేరుకొనిన లక్ష్మణుని, శ్రీరామునకు సమర్పించి శ్రీరామునిచే మెప్పు పొందితివి కదా మారుతీ!

మ. అనఘా, యెంతని చెప్పవచ్చు భవదీయావార్యదోస్సత్త్వమున్
కనకోర్వీధరసన్నిభౌషధగిరిన్ వాలంబునం జుట్టి గ్రం
దున లంకాపురినుండి సత్వరమునం దొల్లింటిచోటుం బడన్
వినువీథిన్ వడి ద్రిప్పివైచితివె జగద్విశ్రాంతిగా మారుతీ. 96

96. పుణ్యాత్మా, నీ తిరుగులేని బలసామర్థ్యమును ఎంతని చెప్పవచ్చును? మేరు పర్వతముతో సమానమైన సంజీవిపర్వతమును, తోకతో చుట్టి, త్రిప్పి లంకాపురినుండి, ముందున్న స్థలములో పడునట్లు ఆకాశమున విసరివేసితివి కదా మారుతీ!

మ. అల మైరావణు డొక్క నాఁటినిశి నిద్రాసక్తులై యున్న భూ
ప లలామేంద్రుల ముచ్చిలించియు వెసన్ పాతాళలంకాపురిన్
ఖలుఁ డై చొచ్చిన వాని వెంటఁ జని యాకష్టాత్ముని ద్రుంచి శో
భిలుచున్ నీ వటు రామలక్ష్మణుల దేవే క్రమ్మఱన్ మారుతీ. 97

97. ఒకనాటి రాత్రి శ్రీరామలక్ష్మణులు నిద్రించుచుండగా మైరావణుడను రాక్షసుడు వారిని దొంగిలించుకొనిపోయి, లంకాపురము క్రింద పాతాళమున నున్న పాతాళలంకా పురిలో దాచెను. అప్పుడు నీవు, మైరావణుని వెంట వెళ్ళి, వానిని, చంపి శ్రీరామలక్ష్మణులను తిరిగి తీసికొని వచ్చితివి కదా మారుతీ!

మ. ధశకంఠుం బరిమార్చి, యాత్మజయముం ధాత్రీజకుం జెప్పి, త
త్కుశలం బారసి రమ్మటంచు వెస గాకుత్థ్సుండు పంపం బురం
బు శశిప్రక్రియఁ జొచ్చి, రావణువధంబుం దెల్పి, సీతాసతిన్
విశదానందరసాబ్ధిఁ దేల్చినది నీవే కావొకో మారుతీ. 98

98. రావణుని చంపి, శ్రీరాముడు తన జయమును సీతీదేవికి చెప్పి, సీతాదేవి క్షేమమును తెలిసికొని రమ్మని నిన్ను పంపెను. మబ్బులు పోయి పాలవర్ణపు వంటి వెన్నెల కాంతితో ప్రకాశించు శరత్కాలపు చంద్రునివలె, సంతోషముగా నీవు లంకాపురములోనికి వెళ్ళితివి. సీతాదేవికి రావణవధను తెలిపి, ఆమెను ఆనందరససముద్రములో తేలియాడ చేసినది నీవేకదా మారుతీ!

శా. ధీరోదాత్తుఁడు రాముఁడంప నటు నంది్గ్రామముం జేరి, నీ
వారూఢిన్ భరతున్ మహాత్ముఁ గని, రామాధీశ్వరుం డర్థి సీ
తారామావరజాన్వితంబుగ భరద్వాజాశ్రమం బర్మిలిం
జేరెన్ ఱేపట వచ్చు నంచు నమృతస్ఫీతోక్తులం తెల్పి యా
ధీరున్ హర్షపయోధి వీచికలపై దేలింపవే మారుతీ. 99

99. వీరశృంగారనాయకుడైన శ్రీరాముడు తను తిరిగి వచ్చుచున్న వార్తను, భరతునికి చెప్పుమని నంది్గ్రామమునకు నిన్ను పంపెను. నీవు నంది్గ్రామము వెళ్ళి, భరతుని చూచితివి. "సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమము తిరుగు ప్రయాణమున చేరినారు. వారిని సేవించి, రేపు ఇచ్చటికి వచ్చెదరు." అని అమృతము వంటి తియ్యని మాటలు చెప్పి, భరతుని సంతోషసాగరతరంగముల మీద తేలియాడ చేసినది నీవేకదా మారుతీ!

మ. సరసాగ్రేసరుఁ డైన రామవిభుఁ డంచద్రత్నసౌవర్ణపు
ష్పరథం బెక్కి సుమిత్రపట్టి వెనుకన్ ఛత్రంబుఁ బట్టన్ మహా
భిరతిన్ లక్ష్మణు డవ్విభీషణు డొగిన్ వింజామరల్ వీవ సుం
దరసాకేతపథంబుఁ బట్టి చనుచోఁ దత్పాదుకల్ మౌళిపైఁ
బరమప్రీతి ధరించి ముందర జనవే వర్ణింపుచున్ మారుతీ. 100

100. రత్నములు చెక్కిన బంగారుపూల రథములో సీతారాములు కూర్చుని, వారివెనుక శత్రుఘ్నుడు తెల్లగొడుగు పట్టుకొని, లక్ష్మణ విభీషణులు మహాసంతోషముతో ఇరువైపుల వింజామరలు వీచుచుండిరి. అట్లు రథము మహాసుందరముగా నలంకరించిన, సాకేతపుర రాజవీధిలో వచ్చుచుండెను. అరథము ముందు శ్రీరామపాదుకలు నీతలపై పెట్టుకొని, రామమహిమను పరమప్రీతితో వర్ణించుచు వచ్చుచుంటివి కదా మారుతీ!

మ. ప్రమదం బొప్పఁగ రాముఁడున్ భవదభిప్రాయంబు నూహించి, నీ
సముదంచత్పదభక్తికిన్ విమల ప్రజ్ఞాయుక్తికిన్ మెచ్చి, సం
యములైనన్ బడయంగ రాని మహనీయాధ్యాత్మవిద్యోపదే
శముఁగావింపఁడె నీకు మేదినిసుతాసంయుక్తుఁడై మారుతీ. 101

101. దాసునిగా నీవు ప్రదర్శించిన అనన్యభక్తికి, నీ నిర్మల ప్రజ్ఞకు, శ్రీరామచంద్రుడు మెచ్చెను. సర్వప్రాణిహితమే కోరు మహాఋషులెంతో ఘోరతపస్సు చేసికూడ పొందలేనిది, మహత్తరమైన పరబ్రహ్మతత్త్వము. అది సాధించుట నీ తపస్సు. దానిని గ్రహించిన శ్రీరాముడు అది నీకు సీతాసమేతముగా ఉపదేశించెను కదా మారుతీ!

మ. భవదీయోరుతపఃప్రభావమును శశ్వత్సాధుభావంబు, యో
గ్యవివేకంబును శాస్త్రపాండితియు నిష్కామత్వమున్ సంతతా
ర్జవమున్ జూచి రఘుప్రవీరుండు భవిష్యద్బ్రహ్మవౌదంచు నీ
కు వరం బర్థి నొసంగడే బృహదనుక్రోశంబునన్ మారుతీ. 102

102. నీ తీవ్రతపస్సు, సత్ప్రవర్తనము, బుద్ధితో సరిగా విచారించుశక్తి, సర్వశాస్త్రముల పాండిత్యము, కోరికలు లేకుండుట, చక్కని నడవడి చూచి శ్రీరామచంద్రుడు రాబోవుకాలమునకు బ్రహ్మ కాగలవని వరమిచ్చెను కదా మారుతీ!

మ. మునిశాపంబున నీప్రభావమహిమంబున్, శక్తియున్ నీ వెఱుం
గని బీజంబున శైలసుప్తవిలసత్కంఠీరవేంద్రంబు లా
గున నట్లుంటివి గాక నిక్కము మదిన్ గోపించినన్ సర్వలో
కనికాయంబుల నొక్క పెట్ట నుఱుముం గావింపవే మారుతీ. 103

103. ముని శాపమువలన నీమహిమ, స్వప్రభావము నీశక్తి నీకు తెలియని కారణమున, కొండలో నిద్రించు సింహమువలె నున్నావు. నీవు నిజముగ కోపించినచో, లోకముల నన్నింటిని ఒక్కదెబ్బతో భస్మము చేయు శక్తి కలవాడవు కదా మారుతీ!

మ. హరివంశోత్తమ! నీవు చేసిన విచిత్రాచింత్యకార్యంబు లా
హరి యైనన్, హరుఁడైన, పంకజభవుండైనన్, దిగీశుల్, పురం
దరుఁడైనన్, నిఖిలాహిలోకపతులైనం జేయఁగా లేరు నీ
సరివా రెవ్వరు లేరు ముజ్జగములం జర్చింపఁగా మారుతీ. 104

104. వానరవంశములో గొప్పవాడా! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, దిక్పాలకులు, ఇంద్రుడు, నాగరాజు చేయలేని ఊహాకందని ఆశ్చర్యకరమైన కార్యములు నీవుచేసితివి. నీతో సరితూగువారు ముజ్జగములలో ఎవ్వరును లేరు మారుతీ!

మ. ధృతియున్, నీతియు, సాహసంబు, స్మృతియున్, తేజంబు సర్వశ్రుతి
స్మృతిపారీణతయున్, యశంబు, విజయోన్మేషంబు శాస్త్రజ్ఞతా
చతురత్వంబు, శమక్షమాదిగుణముల్, సాధుత్వమున్, శౌర్యమున్
వితతప్రజ్ఞ, జితేంద్రియత్వము రహిన్ నీకే తగున్ మారుతీ. 105

105. ధైర్యము, నీతి, సాహసము, జ్ఞాపకశక్తి, తేజస్సు, అన్నివేద, శాస్త్రములయందు పాండిత్యము, కీర్తి, విజయవికాసశక్తి, శాస్త్రచమత్కారశక్తి, శాంతి, ఓర్పు మొదలైన గుణములు, మంచితనము, పరాక్రమము, వివిధ సమయములకు తగిన విషయములు గుర్తుతెచ్చుకొను సమయస్ఫూర్తి, ఇంద్రియనిగ్రహము లోకములో నీకే కలవు మారుతీ!

శా. నీమాహాత్మ్యము, నీరయోపచయమున్, నీసత్త్వసామగ్రియున్
సామాన్యంబె యొకింత వాయువునకున్, నాగారికిన్, కల్గితే
నేమోకాని తలంప ముజ్జగములం దెవ్వారికిం గల్గదో
హైమాద్రిప్రతిమోన్నతీ! గురుమతీ! అర్కద్యుతీ! మారుతీ. 106

106. హిమాలయపర్వతమువలె గొప్పతనము కలవాడా! గొప్పబుద్ధిగలవాడా! సూర్యతేజస్సుకలవాడా! స్వాతినక్షత్రం వలె ప్రకాశించువాడా! నీ మహిమ, నీవేగవృద్ధి, నీ బలపరాక్రమములు సామాన్యమా? సామాన్యమైనవికావు. అసాధారణమైనవి. నీశక్తిలో కొంత వాయుదేవునకు, గరుత్మంతునకు కలిగితే గలిగియుండవచ్చును. మూడులోకములలో మరెవ్వరికీ లేదని తలంపవచ్చును.

మ. ఉదయాస్తాద్రులమీఁద పాదయుగళం బొప్పారగా నుంచి, మే
ను దివం బంతయు నిండఁ బెంచి, యలభానుం డర్మిలిం జెప్పఁగా
జదువుల్నేర్చుతఱిన్ భవత్తనువిలాసం బంతయుం జూచి స
ర్వదివౌకుల్ వెఱతోఁ ద్రివిక్రమునిగా భావింపరే. మారుతీ. 107

107. ఒకపాదము తూర్పుకొండమీద, రెండవపాదము పడమటి కొండమీద చక్కగా నిలిపి; నీశరీరము నంత పెద్దగా చేసి ఆకాశము నిండునంతగా పెంచి, సూర్యభగవానుని వద్ద వేదములు నేర్చుకొను సమయమున నీ శరీరవిలాసము చూచిన దేవతలు నిన్ను త్రివిక్రముడా! అని తలంచిరికదా మారుతీ!

మ. అమరాద్రిప్రతిమానవిగ్రహము, బాలార్కప్రతీకాశవ
క్త్రము శోభిల్లఁగఁ బారిజాతతరుమూలం బందు గూర్చుండి, యు
త్తమభక్తిన్ రఘురామమూర్తిని మదిన్ ధ్యానింపుచున్ దత్పవి
త్రమహామంత్ర మొగిన్ జపించు నినునే ప్రార్థించెదన్ మారుతీ.108

108. నీ శరీరము మేరుపర్వతముతో సమానమైన బంగారువిగ్రహము. నీ ముఖము ఉదయించుచున్న సూర్యుని తేజస్సు వలె ఎఱ్ఱగ నున్నది. అట్టి శోభకలిగిన నీవు, మంచివాసన కలిగిన పారిజాత చెట్టు మొదలున కూర్చొని ఉత్తమ భక్తితో రామరూపమును మనస్సులో ధ్యానింపుచు రామమంత్రమును జపించుచున్నావు. అట్టి నిన్ను నేను ప్రార్థించెదను మారుతీ!

శా. నీకళ్యాణగుణంబులున్, మహిమయున్, నీరేజగర్భుండు, తా
రాకాంతుండును, భోగివల్లభుఁడు, గీర్వాణప్రభుండున్, భవా
నీకాంతుండు గణింపజాల రనినన్ నేనెంతవాడన్ రహిన్
నాకుం దోఁచినభంగి నెన్నితిఁ గృపన్ మన్నింపవే మారుతీ. 109

109. నీమంగళగుణములు మహిమ, సరితూచి లెక్కించుటకు బ్రహ్మదేవుడు, బృహస్పతి, ఆదిశేషుడు, దేవేంద్రుడు, పరమశివుడు చాలరు. ఇంక నే నెంత వాడను? నాకు తోచినట్లు చెప్పితిని. దయతో మన్నించు మారుతీ!

శా. ఆరామాధిపు నొద్ద వానరు లనేకాక్షౌహిణుల్ లేరె? యె
వ్వారైనన్ బహులక్షయోజనము లవ్వారాశి లంఘించి, సొం
పారన్ యామములోన నౌషధినగం బాసక్తి తేఁజాలిరే?
ఔరా! నీకది చెల్లెఁగాక! కపివంశాగ్రేసరా! మారుతీ. 110

110. శ్రీరామచంద్రునితో సహకరించి యుద్ధముచేయుసేనలో అనేక అక్షౌహిణులకొద్దీ వానరులున్నారు కదా. అందులో ఏఒక్కడైనా అన్ని ఆమడల సముద్రాన్ని దాటి సంజీవిపర్వతమును ఒక రాత్రిలో తేగలిగిరా? ఎవ్వరికి చేతకాని పని నీ కొక్కనికే చెల్లినది.అది ఆశ్చర్యంకదా స్వామీ!

శా. నీనామంబు పఠించినన్ నిను మదిం జింతించినన్ నీకథా
గానం బుద్ధతి సల్పినం గరము వేడ్కన్ నిన్నుఁ బూజించినన్
నానావ్యాధు లడంగు, వేలుపుల సన్మానంబు సంధిల్లు, వి
ద్యానైపుణ్యము గల్గు, చేకుఱును దీర్ఘాయుష్యమున్ మారుతీ. 111

111. నీపేరు తలచినా, నిన్ను మనసులో ధ్యానించినా, నీకథలు పాటలు కట్టిపాడినా, నిన్ను భక్తితో పూజించినా ఎక్కడెక్కడి వ్యాధులు నయమైపోతాయి. దేవతలు కోరికలు తీర్చిసంతోషిస్తారు. చదువుసంధ్యలు బాగావస్తాయి. దీర్ఘాయస్సుకలిగి నీభక్తులు జీవిస్తారు. నీలో అంత మహిమ ఉంది స్వామి.

శా. నీపేరెంచిన శత్రువర్గము వెసన్ నిర్మూలమైపోవు సం
తాపంబుల్ దొలఁగున్, సమస్తదురితాంతం బౌను, కూశ్మాండ మా
రీ, పైశాచిక, యక్ష, రాక్షస గ్రహ, ప్రేతోగ్రభూతాదినా
నాపీడల్ నశియించు, భద్ర మొదవున్ సత్యంబుగా మారుతీ. 112

112. నీపేరు నిశ్చలభక్తితో జపించిన శత్రువుల వైరభావము నిర్మూలమైపోవును, కష్టములన్నితొలగును, పాపములన్నిపోవును. కూశ్మాండ, మారీ, పైశాచిక, యక్ష, రాక్షస, దుష్టగ్రహముల ప్రేతల పీడలు తొలగిపోవును. రాబోవు కాలమున మంచి కలుగును మారుతీ!

మ. విమలంబై, వినఁజిత్రమై, వితతమై, విద్యోతమై, వేద్యమై,
యమృతంబై, యఘహారమై, యమితమై, యానందమై యాద్యమై
సుమనస్సమ్మతమై, సుధీవినుమై, సుజ్ఞానమై, సూచ్యమై,
సముదంచద్గతి నొప్పు నీమహిమ కీశగ్రామణీ, మారుతీ. 11

113. నీమహిమ దోషరహితము, వినుటకు చిత్రము, అనేకవిషయపరిచయము ప్రతి విషయప్రకాశనేర్పుకలది, అందరిమేలుకు తెలియదగినది, ఎప్పుడు నాశనము లేక ప్రకాశించునది, పాపమును పోగొట్టునది, అంతులేనిది, ఆనందమైనది, మొట్టమొదట తెలిసికొనదగినది, మంచివారి కిష్టమైనది, పండితులచే స్తుతింపబడునది, మంచిజ్ఞానమునిచ్చునది, ప్రవర్తనకు సూచించునది, ఊహింపరాని ఫలము నిచ్చునదిగా ప్రకాశించుచున్నది మారుతీ!

శా. ఆసుగ్రీవుఁడు కీశరాజ్యపదవిం బ్రాపించుటల్ రాముఁడు
ల్లాసం బొప్పఁగ నవ్విభీషణునకున్ లంకాపురం బిచ్చుటల్
వాసిం గాంచి తరించుటల్ దశముఖున్ భంజించుటల్, మూర్ఛితుం
డౌసౌమిత్రినిఁ దేర్చుటల్, మరల సీతావాప్తియున్ సర్వమున్
నీసాహయ్యము చేతనే కద? లసన్మేధానిధీ, మారుతీ. 114

114. అసుగ్రీవుడు కిష్కింధారాజ్యము పొందుట, శ్రీరాముడు విభీషణునకు లంక నిచ్చుట, కీర్తి పొందుట, రావణుని చంపుట, మూర్ఛపోయిన లక్ష్మణుని, తేర్చుట మరల సీతను పొందుట అన్నీ నీ సహాయము వలన జరిగినవే కదా మారుతీ!

మ. పదదోషంబులు సంధిదోషము, యతిప్రాసాదిదోషంబులున్
ప్రథితవ్యర్థ్యసమాసదోషము రసార్థప్రక్రియాదోషముల్
పదపద్యంబులఁ గల్గియున్న ననుకంపన్ వాని నన్నింటి నీ
మది సైరించి, గుణంబుగాఁ గొని ననుం బాలింపవే మారుతీ. 115

115. నా నోటినుండి వచ్చిన ఈ పద్యములలో ఎదైన తప్పు పదములు పడుటకాని, పదములు కలుపు దోషము కాని, యతి, ప్రాస మొదలగు దోషములుకాని, వాటి నుపయోగించు నపుడు వాటిస్థానములు నిర్ణీతములు కనుక కొన్ని సమాసములను నింపు వ్యర్థపదముల దోషముకాని, రసము, అర్థమునకు సరియైన పదము లుపయోగించు నపుడు పదములలోని ఒకటి రెండక్షరములు తగ్గించి వాడునపుడు వచ్చు దోషముకాని, పదములలోకాని పద్యములలో కాని యున్నచో వాటిని దయతో దిద్దుకొని సరిగా ప్రయోగించినవే అనుకొని నన్ను కాపాడుము మారుతీ!

మ. చతురత్వంబున గోపినాథకులవిస్తారుండు శ్రీపద్మనా
భతనూజుండగు వేంకటాఖ్యకవి విద్వత్సమ్మతంబైన యీ
శతకంబున్ రచియించి, నీకు సముదంచద్భక్తి నర్పించె, స
మ్మతితో దీనిఁ బరిగ్రహించి, కరుణం బాలింపవే మారుతీ. 116

116. గోపినాథ వంశవృక్షమునకు చెందిన వాడను. శ్రీపద్మనాభశాస్త్రికుమారుడను. వేంకటకవి (వెంకయ్యశాస్త్రి వ్యవహారనామము) అను పేరుగల నేను పండితులకు అంగీకారముమైన ఈ శతకమును గాఢభక్తితో రచించి నీకే సమర్పించుకొను చున్నాను. దీనిని ప్రీతితో అందుకొని దయతో కాపాడు మారుతీ!

శ్రీశ్రీమదాంజనేయోజయతి

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత

శ్రీరామచంద్రార్పణమస్తు

హరి. ఓం నమశ్శివాయ

844:8131
UGN
Acc no. 22697